

**'కళాతపస్వి' - కె. వెంకటప్ప**

**(1886 - 1965)**

## చిత్రకారుని గురించి

అవనీంద్రనాథ్ టాగూర్ శిష్యులైన శ్రీ కె. వెంకటప్ప చిత్రకళ, శిల్పం, రేఖా సృజనాత్మకత ఆయన సొత్తు. మానవ ఆకృతి అధ్యయనంలో సుప్రసిద్ధులు.

లలిత కళా అకాడెమి సభ్యులు. స్వామి శివానంద శిష్యులు. అవివాహితులుగ ఎనుబదేళ్ళు సార్థక జీవితం గడిపిన కళాతపస్వి.

బెంగుళూరులో వెంకటప్పగారి స్మృతి చిహ్నంగా ఆర్ట్ గ్యాలరి వుంది.

సర్ విలియమ్ రూథన్‌స్టన్ - లండన్ రాయల్ కాలేజ్ ఆఫ్ ఫైన్ ఆర్ట్సు అధ్యక్షులు శ్రీ కె. వెంకటప్ప గురించి "ప్రపంచమందలి ఏదేని చిత్రకళా మహా విద్యాలయంలో ఆచార్య స్థానమున వుండదగిన విశిష్ట కళాకారుడు, కె. వెంకటప్ప."

ముఖచిత్రం : శివతాండవం

మూడవ, నాల్గవ అట్టపై చిత్రాలు కూడా వీరివే.

సేకరణ: జానమద్ది హనుమచ్ఛాస్త్రి

# మిసిమి

"All that we are is the product of what we have thought"
is "We are what we think." - Dammapada.

సంపుటి 14 మార్చి 2003 సంచిక 3

వ్యవస్థాపక సంపాదకుడు : **డాక్టర్ రవీంద్రనాథ్ ఆలపాటి**

## విషయ సూచిక

పృథ్వీమథనం - బి.వి. రామిరెడ్డి

సర్ప ప్రపంచం - సి. వి. సర్వేశ్వర శర్మ

వేయి పడగల నీడన భావి భారతం! - నరేష్ నున్నా

రుబాయీ ప్రేమైక తాత్వికుడు ఉమర్ ఖయ్యామ్ - నాగులూరు దయాకర్

అంతర్జాతీయ భాష - వాడపల్లి లక్ష్మీనారాయణాచార్యులు

యుద్ధం ఒక ఉన్మాదం - జె. కృష్ణమూర్తి - సరోజిని ప్రేమ్ చంద్

హిందూయిజం-ఒక పరిశీలన - డా॥ఎన్. ఇన్నయ్య

విడిప్రతి రూ. 8/- వార్షిక చందా రూ. 100/- విదేశీయులకు $ 20

ముఖచిత్రం : **"శివ తాండవం"**

చిత్రకారుడు : **కె.వెంకటప్ప**

Printed & Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd.,
1-1-60/5, R.T.C. 'X' Roads, Musheerabad, Hyd - 20. Ph. 7645536
E-mail : misimieditor@rediffmail.com

సంపాదకుడు : **అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి**

# మిసిమి వినతి

## చందా దారులుగా చేరండి. చేర్పించండి. చదవండి. చదివించండి.

1948లో జ్యోతి, సినిమా రేరాణి పత్రికలను స్థాపించి, సెక్స్ పదాన్ని ఉచ్చరించటానికి వెరచిన ఆరోజులలో ఎవలాక్ ఎలిస్, ఫ్రాయిడ్‌లను తెలుగు గడ్డకు పరిచయం చేసి, నాడే ఎలెన్ రాయ్ వ్రాసిన కుటుంబ నియంత్రణ వ్యాసాన్ని తమ పత్రికలో ప్రచురించి ప్రభుత్వం కన్నెర్రకు గురయిన డా॥ ఆలపాటి రవీంద్రనాథ్ మళ్ళా 1990లో మిసిమి పత్రికను స్థాపించారు. 'మిసిమి' అంటే బంగారం. చూడటానికి సోయగంగా ఉండే, చదివితే ఆలోచనలు రేకెత్తించే మేధావుల మాస పత్రిక మిసిమి.

ఆచార్య సచ్చిదానంద మూర్తి, సంజీవదేవ్, అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి, ఇన్నయ్య, రవిచంద్, 'మో', తిరుపతిరావు, దయాకృష్ణ, పోతుకూచి సుబ్రమణ్య శాస్త్రి ఆరుద్ర, యు.ఎ.నరసింహమూర్తి. బి.వి. రామిరెడ్డి, కాత్యాయని విద్మహే, శివలింగం, పురాణం లాంటి మేధావి వర్గం సంస్కృతి, సాహిత్యం, సాహితీ విమర్శ, తత్వం, సైకాలజీ, సైన్సు, చరిత్ర, కళలపై వ్రాసిన, వ్రాస్తున్న వ్యాసాలతో మిసిమి మేధావుల పత్రికగా ఆంధ్ర దేశంలో సుస్థిర స్థానాన్ని ఆర్జించింది.

మిసిమి ప్రత్యేకత ఏమిటంటే ఇందులో కథ, నాటకం, నాటిక, గేయం, పద్యం, క్రికెట్, రాజకీయం, సినిమా తారలు, ప్రకటనలు మొదలైనవి ఉండవు. కారణం ఈ విషయాలను ఆదరించడానికి అనేక పత్రికలు ఉన్నాయి. మిసిమిలో ప్రచురితమయ్యే వ్యాసాల లాంటి వ్యాసాలకు చోటు కల్పించే పత్రికలు లేవు.

మిసిమిలో వ్యాసం ప్రచురితమైతే ఒక పిహెచ్.డి. వచ్చినట్లే అనే భావన జనంలో ఏర్పడింది.

అన్నపరెడ్డి వ్రాసిన ''మేధావుల మెతకలు'', పురాణం వ్రాసిన ''మధురవాణి ఇంటర్వ్యూలు'' ప్రచురించిన మిసిమి పోస్టుమాడర్నిజమ్, బౌద్ధం, ఎరిక్ ఫ్రామ్, సెక్సువాలిటిలపై ప్రత్యేక సంచికలను వెలువరించింది. కథనం (Narrative) మీద ప్రత్యేక సంచిక తేవాలని తలంపు.

ఇది సీరియస్ పాఠకుల సీరియస్ పత్రిక.

సాలు చందా విదేశీయులకు $20. స్వదేశీయులకు రూ. 100/-లు. మిసిమి పేర డి.డి.లు, యం.ఓ.లు పంపండి.

పంపవలసిన చిరునామా :

**మిసిమి**
1-1-60/5, కళాజ్యోతి ప్రాసెస్ లిమిటెడ్,
ఆర్.టి.సి.క్రాస్ రోడ్స్, ముషీరాబాద్,
హైదరాబాద్ - 500 020. ఎ.పి., ఇండియా.
ఫోన్ నెం. 040 - 27645536

# పృథ్వీమథనం

## (1920వ సంవత్సరపు నోబెల్ సాహితీ పురస్కార స్వీకారోపన్యాసము)

మూలం: కుట్ హమ్సున్ అనువాదం: బి.వి. రామిరెడ్డి

ఇలాంటి గొప్ప పురస్కారాన్నందుకుంటున్న ఆనంద సమయంలో నేనేం చేయగలను? నా కాళ్ళు గాలిలో తేలిపోతున్నట్లు, నేను గాలిలో నడుస్తున్నట్లు, నా తల తిరిగి పోతున్నట్లు అనుభూతిని పొందుతున్నాను. నేను నేనుగా ఉండడం ఈ క్షణాల్లో అసాధ్యం. నన్ను సంపద, గౌరవం ఒక్కసారిగా ముంచెత్తాయి. నేను నేనే. అయినా, నా దేశానికి నా ద్వారా మీరిచ్చిన ఈ పురస్కారం నన్ను వివశుణ్ణి చేస్తోంది.

నాకిలాంటి అనుభూతులు కొత్తేమీకాదు. నేను యౌవనంలో ఉన్నప్పుడు ఇలాంటి అనుభూతుల్ని పొందాను. అలాంటి అనుభూతిని పొందని యువకులు పుట్టుకతో వృద్ధులు. అలాంటి యువతీయువకులు దురదృష్టవంతులు. అలాంటి గొప్ప అనుభూతులు తరువాతి జీవితంలో ఎప్పుడొస్తాయో ఎవరికి తెలుసు ?

ఏది ఏమైనప్పటికీ, ఇలాంటి విజ్ఞులైన పెద్దల ముందు, ఇది నా జీవితంలో చాలా గొప్ప రోజని ఒప్పుకుంటున్నాను. వేలమంది మహా రచయితలలోంచి నన్ను ఎంచుకున్న మీ దాతృత్వానికి కృతజ్ఞతలు. నా దేశపు ప్రతినిధిగా ఈ స్వీడిష్ అకాడెమికి, ఈ ప్రజలకు నాకీ పురస్కార ప్రదానం చేసినందుకు మరీమరీ కృతజ్ఞతలు తెలియ జేసుకుంటున్నాను. వ్యక్తిగా ఈ పురస్కార భారంతో తల వొంచుతున్నాను. అంతేకాదు, మీ అకాడెమి ఈ పురస్కారాన్ని మోయగలశక్తి నాకున్నదని నిర్ణయించినందుకు గర్వ పడుతున్నాను.

ఒక గౌరవనీయుడైన ఉపన్యాసకుడు నాకొక ప్రత్యేకమైనశైలి ఉన్నదని ప్రశంసించారు. ఆ విషయాన్ని అంగీకరిస్తున్నాను. అందరిలాగే నేనూ ప్రతి మనిషి నించీ ఎంతో కొంత నేర్చుకున్నాను. గతయుగాల స్వీడిష్ కవిత్వాన్నించీ, ముఖ్యంగా గీతాల నించి ఎంతో నేర్చుకున్నాను. ఎన్నో సాహిత్యాల నుండి నేను ఎంతో నేర్చుకున్నాను.

ఇప్పుడు, ఈ దీపాల వెలుగులో, ప్రతివొక్కరికి కవితలతో, పూలతో బహుమతి ప్రదానం చేయాలనిపిస్తోంది. మళ్ళీ యౌవనవంతుణ్ణి కావడం, ఆనందపుటలలమీద తేలిపోవడం ఎంత బాగుంటుంది! కాని, అలాచేసి అపహాస్యంపాలు కాలేను. ఈ రోజు సంపద, గౌరవం నన్ను ముంచెత్తాయి. అయితే, ఒక అమూల్యమైన పురస్కారం లోపించింది, అది యౌవనం. వృద్ధులైనవారు మళ్ళీ ఒకసారి గతంలోకి అడుగిడి ఆ యౌవనాన్ని అనుభూతిలోకి తెచ్చుకోవాలి.

నాకేం చేయాలో పాలుపోవడం లేదు. స్వీడిష్ యువతకు, ప్రపంచ యువతకు నాచీర్స్ తెలియజేస్తున్నాను.

---

బి.వి. రామిరెడ్డి, సిద్ధార్థ ఆర్ట్స్ & సైన్స్ కళాశాలలో ఆంగ్లోపన్యాసకులుగా పనిచేస్తున్నారు, విజయవాడ.

ఈ స్వీకారానికి ముందు ప్రొఫెసర్ ఆస్కార్ మోంటెలియస్. ''మీరు సాధ్యమైనంత సంక్షిప్తంగా మాట్లాడతారని తెలుసు. అయితే మీ ''గ్రోత్ ఆఫ్ ది సాయిల్'ని అభిమానించే మేమంతా మీ పరిచయానికి ఆనందిస్తున్నాము'' అన్నారు.

***బహుమతి సమర్పణోపన్యాసం :*** హెరాల్డ్ జార్న్, ఛైర్మన్ నోబెల్ కమిటీ.

ఆనవాయితీ ప్రకారం ఈ సంవత్సరపు నోబెల్ సాహితీ పురస్కారాన్ని ప్రఖ్యాత నార్వీజియన్ రచయిత కుట్ హామ్సన్‌కు ఆయన రచించిన ''గ్రోత్ ఆఫ్ సాయిల్'' కు ఇవ్వాలని నిర్ణయించబడింది.

అతి కొద్ది సమయంలో ఈ గ్రంథాన్ని సమీక్షించడం అసంబద్ధంగా ఉంటుంది. ఈ గ్రంథంలోని శైలి, విషయం, అనేక దేశాల, భాషల పఠితలను ఆకట్టుకుంది. ఈ సంవత్సరమే ఈ గ్రంథానువాదం ఇంగ్లండు పాఠకులకు అందుబాటులోకి వొచ్చింది.

సాహిత్యంలో వాస్తవికతను ఆశించేవారిని ''గ్రోత్ ఆఫ్ ది సాయిల్''లోని జీవితపు వాస్తవికత ఆకట్టుకుంది. ఈ గ్రంథంలో చిత్రించబడిన జీవితం; ప్రకృతితో, జీవిత సత్యాలతో జరిగే సంఘర్షణ ఈ పుస్తకాన్ని ఒక ఆధునిక మహాకావ్యాన్ని చేశాయి.

ఈ గ్రంథాన్ని మహాకావ్యం అనడం సబబే. మన సమకాలీన సంస్కృతికి చెందిన ఈ మహాకావ్యాన్ని ప్రాచీన మహాకావ్యాలకు అనుకరణ అనడానికి వీల్లేదు. ఇది జీవన పురాణం. ప్రాచీన మహాకావ్యాలతో పోల్చడానికి వీల్లేనిది. అనంతమైన జీవితం కాలానుగుణంగా మార్పు చేర్పులతో కొత్త మహా కావ్యాలుద్భవిస్తాయి.

హామ్సన్ కావ్యం శ్రమ పురాణం. అది సమస్త మానవాళి యొక్క సమిష్టి శ్రమకు సంబంధించినది. భూమి పుత్రుడి శ్రమ, ఆక్రమంలోని కష్టాలు, అతని సుదీర్ఘ సంఘర్షణ, ధీరత్వం, త్యాగం ఇందులోని ప్రముఖ విషయాలు. ఈ గ్రంథంలోని నాయకుడైన హిసియడ్ వ్యవసాయ శ్రమలోని కష్టాలను వివరిస్తాడు. హామ్సన్ తన గ్రంథంలో వ్యవసాయ దారుడు తన జీవిత కాలాన్ని భూదేవికి అంకితం చేసుకోవడం. భూమిని తన శక్తిని మెప్పించి చదునుచేయడం, పదును చేయడం, ప్రకృతి శక్తులు కల్పించే ఆటంకాలను అధిగమించడం వర్ణించాడు. ఆ విధంగా శారీరక శ్రమ ద్వారా ప్రాచీన సాంప్రదాయాన్ని ఉద్భవింపజేసుకోవడాన్ని అవగాహనలోకి తీసుకొచ్చాడు.

హామ్సన్ తన రచనలో మూసల్ని తయారు చేయలేదు. అతని నాయకీ నాయకులు సజీవులు. వారు తమ పరిసరాలలో సాదాగా వొదిగిపోతారు. వారు గొప్ప ఆలోచనలు చేయరు. ఆదర్శాలు పెట్టుకోరు. మౌనంగా జీవిస్తారు. కొన్ని పాత్రలు కష్టాలతో, అహంకారాలతో, ఆశలతో, పొరబాట్లతో మారిపోతూ వుంటాయి. వారందరిలోను నార్వీజయన్ లక్షణాలుంటాయి. అందర్నీ భూమి ఫలాలు ప్రభావితం చేస్తుంటాయి. ఈ భాషలో ఒకే మాట నానార్థాల్నిస్తుంది. భూమి తీపి, చేదు ఫలాలను అందిస్తుంది. ఇవన్నీ స్వీడన్ ప్రజలకు కొత్తేమీకావు. ఉత్తర ప్రాంతపు వాతావరణం. సహజాతాలతో ఆ సమాజాన్ని ఈ రచనలో చూస్తాం. ఇంకా ఎన్నో విషయాలను రచయిత ఈ గ్రంథం ద్వారా మన ముందుంచారు. ఈ రచనలోని సహజ మానవతను ఎవరూ మరచి పోలేరు. అందుకే ఈ రచన వివిధ

దేశాల మనస్తత్వాల, భాషల, ఆచారాల ప్రజలను ఆకట్టుకున్నది. అంతేగాక చాలా బాధాకరమైన విషయాలను వివరించేటప్పుడు రచయిత ఉపయోగించిన హాస్యం, మానవ గమ్యం, మానవ స్వభావాలు, మొదలైన వాటి మీద అతనికున్న అపేక్షను తెలియజేస్తుంది. అయితే రచయిత ఎక్కడా కళాత్మకతను కించపరచడు. ఈయన శైలి నిరలంకారమైనది. అలాంటి శైలిలో వాస్తవాలను గాఢంగా చిత్రించాడు.

మిస్టర్ కుట్ హమ్సన్, మీకు ఈ పురస్కారాన్ని అందజేయడంతో స్వీడిష్ నోబెల్ అకాడెమి ఎంతో ఆనందిస్తోంది. అకాడెమి తరుపున ఈ తక్కువ సమయంలో మీ కావ్యంలోని కొన్ని పార్శ్వాలను మాత్రమే విశ్లేషించే ప్రయత్నం చేశాను. ఈ అకాడెమి తరుపున మీకు నా ధన్యవాదాలు తెలియజేస్తున్నాను.

## జీవిత చరిత్ర

కుట్ హమ్సన్ (1860-1952) నార్వేలోని లోమ్‌లో జన్మించాడు. లోఫోటెన్ ద్వీపాల్లో పేదరికంలో పెరిగాడు. ఏడేళ్ళవయసులో త్రాళ్ళ తయారీదారు దగ్గర సహాయకుడిగా పనిచేశాడు. అదే వయసులో రచన ప్రారంభించాడు. కొన్ని సంవత్సరాల పాటు అమెరికాలో ప్రయాణిస్తూ, చిన్న చిన్న ఉద్యోగాలు చేస్తూ 1889లో అమెరికన్ మేధో జీవితం మీద తన అభిప్రాయాలను ప్రచురించాడు. 1890లో 'హంగర్' నవల వ్రాశాడు. 1894లో రచించిన 'పాన్'తో ప్రసిద్ధ రచయితగా గుర్తింపబడ్డాడు.

హమ్సన్ రచనలలో సాంప్రదాయంమీద, మనిషి జీవిత పరిపూర్ణత భూమి మీదే ఆధారపడి వున్నదన్న నమ్మకం మీద అయిష్టత కనిపిస్తుంది. ఈ సాంప్రదాయ వ్యతిరేకత హమ్సన్ 1917లో రచించిన మహాకావ్యం 'గ్రోత్ ఆఫ్ ది సాయిల్'లో సంపూర్ణంగా కనిపిస్తుంది. అతని మొదటి రచనలు ఒక వెలివేయబడ్డ ఆవారా చుట్టూ తిరుగుతాయి. మధ్య వయసులోని రచనలన్నీ లెక్కలేనితనం, విషాదం, నిరాశ ఆక్రమించుకున్నాయి. ఇవి 1896లో రచించిన 'గేమ్ ఆఫ్ లైఫ్' లాంటి వాటిల్లో ప్రధానంగా కనిపిస్తాయి. 1906లో రచించిన 'అండర్ ది ఆటం స్టార్', 1908లో రచించిన 'ఎ వాండరర్ ప్లేస్ ఆన్ మ్యూటెడ్ స్ట్రింగ్స్' లాంటి నవలలోను అదే ప్రధానాంశం. 1904లో హమ్సన్ 'ది వైల్డ్ కోరస్' అనే కవితా సంకలనాన్ని కూడా ప్రచురించాడు.

హమ్సన్ తరువాతి రచనలు సాంప్రదాయాన్ని ఎదుర్కొనే పాత్రల మీద నడుస్తాయి. ఇవిగాక 1913లో రచించిన 'చిల్డ్రన్ ఆఫ్ ది ఏజ్', 1915లో రచించిన 'సెగల్‌ఫాస్', 1927లో రచించిన 'వేగబాండ్స్', 1930 లో రచించిన 'అగస్ట్', 1933లో రచించిన 'ది రోడ్ లీడ్స్ ఆన్', 1936లో రచించిన 'ది రింగ్ ఈజ్ క్లోజ్డ్' హమ్సన్ ఇతర రచనలు.

హమ్సన్‌కు జర్మనీ అంటే అభిమానం. 1940లో నాజీల నార్వే దండయాత్ర తరువాత, యుద్ధం ముగిశాక ప్రభుత్వం అతని సంపదను తీసేసుకుంది. అతణ్ణి ప్రభుత్వం కొంతకాలం మానసిక పరిశీలనలో ఉంచింది. చివరి రోజుల్ని పేదరికంలో గడిపాడు. అతని సంపూర్ణ రచనలు అతని మరణం తరువాత 1954లో 15 సంకలనాలుగా ప్రచురింపబడ్డాయి.

# సర్ప ప్రపంచం

– సి. వి. సర్వేశ్వరశర్మ

పాము అంటే మనిషికి భయం. పాము కనిపిస్తే దానిని చంపేస్తారు. పాము కాటు వేస్తే మరణిస్తారనే భయం ఉంది. మన దేశంలో ప్రతి సంవత్సరం పాము కాటు వల్ల దాదాపు 20 వేల మంది మరణిస్తున్నట్లు అంచనా. వీరిలో కొందరు భయం వల్ల, మరి కొందరు సరియైన చికిత్సా విధానం తెలియక మరణిస్తున్నారు.

పాముల గురించి ఎన్నో కట్టు కథలు ప్రచారంలో ఉన్నాయి. ప్రజలకు వీటి గురించి కొన్ని అపోహలు కూడా ఉన్నాయి. ప్రపంచంలో సుమారు 2500 రకాల పాములు ఉన్నాయి. వీటిలో దాదాపు 400 రకాల పాములు మాత్రమే విషసర్పాలు. ఐర్లాండ్, న్యూజిలాండ్, అజోరెజ్, బెర్ముడా, హవాలీలో అసలు సర్పాలు లేవంటారు. మన భారత దేశంలో 236 రకాల పాములున్నాయి. అందులో విషసర్పాలు సంఖ్య 51 మాత్రమే.

పాములన్నింటిలోను నాగుపాము ఎక్కువ విషపూరితమైనది. ఇండియాలో ఇవి చాలా అరుదుగా ఉన్నాయి. విషపూరితాలయిన పాముల్లో త్రాచు, కట్ల పాములను ముఖ్యంగా పేర్కొనాలి. ఇంకా అనేక రకాలయిన విషసర్పాలున్నాయి.

మన ప్రాంతాల్లో నల్ల త్రాచు, తెల్ల త్రాచు అనే రెండు రకాల సర్పాలు తిరుగుతూ ఉంటాయి. ఇవి 6 అడుగుల నుండి 10 అడుగుల పొడవు వరకూ ఉంటాయి. పడగ విప్పి బుసలు కొడుతూ తమ శత్రువులను భయపెడతాయి. పచ్చని పొలాలు, బీళ్లు, చెరువుల చుట్టూ పొదలు, పుట్టలు, దేవాలయాలు, ధాన్యపు కొట్లు వీటి నివాస స్థలాలు. సూర్యోదయ సూర్యాస్తమయ సమయాల్లో విహరిస్తాయి. మగత్రాచులతో పెనవేసుకుని ఆటలు ఆడతాయి. ఎలుకలు, గ్రుడ్లు, కప్పలు, బల్లులు, తొండలు, చెదలు వీటి ఆహారం.

**త్రాచు పాములు :**

సామాన్యంగా జనానికి త్రాచులు దూరంగా ఉంటాయి. తప్పనిసరి పరిస్థితులలో కాటు వేస్తుంది. దీని విషం ప్రమాదం మెదడు స్థంభించిపోతుంది. నాడీ మండలం పనిచెయ్యదు. ఊపిరితిత్తులు బరువెక్కి శ్వాస ఆడదు. నోటి వెంట చొంగ కారి, స్పృహ కోల్పోయి నాల్గుగంటలలో సర్పదష్టుడు మరణించే అవకాశం ఉంటుంది.

ఆసియా ఖండపు అడవుల్లో మాత్రమే నాగుపాము ఉంటుంది. 18 అడుగుల పొడవు ఉండే దీని జీవనం, విష ప్రభావం త్రాచుని పోలి ఉంటుంది. ఆఫ్రికా ఖండంలోని రింగాల్ పాము, ముంబా పాము త్రాచు జాతికి చెందినవే.

కట్లపాము నల్లని నీలివర్ణంలో ఉంటుంది. అడ్డంగా తెల్లని కట్లు ఉంటాయి. కొన్ని పాములకు కట్లు పసుపురంగులో ఉంటాయి. సామాన్యంగా రాత్రి ఎనిమిది గంటల సమయంలో ఇది సంచరిస్తూ

సి. వి. సర్వేశ్వర శర్మ, ప్రెసిడెంట్, కోనసీమ సైన్సు పరిషత్, అమలాపురం.

ఉంటుంది. పాడుబడిన ఇళ్లు, గోడల పగుళ్లు, నుయ్యిదిబ్బలు, వంట చెరకు దీని నివాస ప్రాంతాలు. నెమ్మదిగా ప్రాకుతూ వెడుతుంది. దీని విషం ప్రమాదకరమయినది. మనిషిని కాటువేస్తే మెలికలు తిరిగి పోయి స్పృహ కోల్పోతాడు. నాడీమండలం మీద దీని విషప్రభావం ఉంటుంది. ప్రాణహాని సంభవిస్తుంది.

**విషరహిత సర్పాలు :**

పగడపు పాము, సముద్ర సర్పాలు మొదలయిన విష సర్పాలు చాలా ఉన్నాయి. విష రహిత సర్పాల సంఖ్య చాలా ఎక్కువ. బ్లైండ్ స్నేక్స్, త్రెడ్ స్నేక్స్, గొట్టం పాములు, సన్‌బీమ్ స్నేక్, పూడు పాము (అంటే మన దేశంలో ఉండే రెండుతలల పాములని చెప్పుకునేవి), కొండ చిలువ, తుట్టెపాము, జెర్రిపోతు, నీటి పాము, పసిరిక పాము మొదలయినవన్నీ విష రహితమయిన పాములు.

జెర్రిపోతు పసుపు, తెలుపు మిశ్రమ రంగు కలిగి సన్నని మచ్చలతో ఉంటుంది. చాలా చురుకుగా ఉంటుంది. సాధారణంగా కరవదు. ఆత్మ రక్షణ కోసం తోకతో కొడుతుంది. నీటి పాములు సామాన్యంగా కాలువల్లో కన్పిస్తూ ఉంటాయి. పసిరిక పాములు తుమ్మ, వావిల, వేప మొదలైన చెట్ల మీద ఉంటాయి. ఆకు పచ్చరంగు కల్గి ఉండి బుస కొడుతుంది.

పాములు గ్రుడ్లను పొదగడానికి వేసవి కాలం అనుకూలమయినది. లైంగిక వాంఛ తీర్చుకోవడానికి ఆడ పాము కోసం ఎన్నో మగ పాములు కొట్లాడుకోవడం జరుగుతుంది. జాతి పాముల 'శృంగార క్రీడ' సుదీర్ఘంగా జరుగుతుంది. ఆడ పాము, మగ పాము కొన్ని సందర్భాలలో రోజంతా కరుచుకునే ఉంటాయి. ఈ కార్యక్రమం జరిగిన నెల లేదా 45 రోజుల తర్వాత మరుగు ప్రదేశానికి వెళ్లి 15 నుండి 20 వరకు తెల్లని గ్రుడ్లు పెడుతుంది. ఈ గ్రుడ్లను పొదిగి, పిల్లలు వచ్చేవరకు గ్రుడ్లను కాపాడే స్వభావం త్రాచులకు ఉంది.

**పాముల జీవితకాలం :**

పెద్ద జాతి పాములు 20 నుండి 25 సంవత్సరాలు, చిన్న జాతి పాములు 10 నుండి 15 సంవత్సరాలు బ్రతుకుతాయి. పాములు చాలా వేగంగా ప్రాకుతూ వెడతాయని అనుకుంటారు. ఒకటి రెండు పాములు తప్ప మిగిలిన పాములు వేగంగా పాకలేవు.

ఎగిరే పాములున్నాయని చెబుతారు. నిజానికి పాములు ఎగరవు. చెట్లని అంటి పెట్టుకుని ఉండే పాములు ఒక కొమ్మపై నుండి మరొక కొమ్మమీదకు ఎగురగలవు. దక్షిణ భారతంలోని మధ్యప్రదేశ్, ఒరిస్సా, బెంగాల్‌లలోను, దక్షిణ చైనా, ఈస్టు ఇండీస్‌లలో ఈ ఎగిరే పాములు ఉన్నాయి.

**పాముకి చెవులు ఉండవు :**

పాముకి చెవులుండవు. ఒక పలుచని చర్మపు పొర చెవి గూబగా ఉపయోగపడుతుంది. పరిసరాల్లో ఏమాత్రం చిన్న శబ్దమయినా దానికి సంబంధించిన ధ్వని తరంగాలు ఈ చెవి గూబను కంపింప జేస్తాయి. ఈ కంపనాలను బట్టి ధ్వని ఎక్కడ నుండి వస్తోందో పాము సులువుగా గ్రహించగల్గుతుంది. పాము కడుపు భూమికి తాకుతూ ఉండడం వల్ల భూమి ద్వారా వచ్చే కంపనాలను కడుపు మీద చర్మం ద్వారా గ్రహించగల్గుతుంది.

పాముకి కళ్లుంటాయి. కాని కను రెప్పలు ఉండవు. దీని కను పాప గుండ్రంగా ఉండక నిలువుగా చీలి ఉంటుంది. అందుచేత చాలా దగ్గరలో ఉండే వస్తువులను చూడ గల్గుతుంది. నాగ స్వరం ఊదినప్పుడు పాము తన్మయత్వంలో తల ఊపదు. నాగస్వరం ఊదే వ్యక్తి కాలు కదిలే రీతిలో పాము తల కదుపుతుంది.

పాముకి ఊపిరి తిత్తులు, గుండే, మూత్ర పిండాలు వంటి భాగాలు శరీర నిర్మాణంలో ఉన్నాయి. అందుచేతనే పామును పురుగు జాతిలో జేర్చక జంతుజాలానికి చెందినదని చెపుతారు. దీనికి నడిచేందుకు కాళ్లు లేవు పురుగులా పాకుతుంది. కొండ చిలువల కడుపులో ఊరే జఠరరసం జంతువుల ఎముకలను కరగించుకోగలదు.

**పాము నోటి నిర్మాణం :**

పాము తలకాయ నిర్మాణం అది ఆహారం భుజించడానికి వీలుగా ఉంటుంది. క్రింది దౌడలో రెండు ఎముకలు విడిగా ఉంటాయి. ఈ ఎముకలను కండరాలు కలుపుతాయి. నోరు తెరచినపుడు ఈ కండరాలు సాగి నోరు బాగా విశాల మవుతుంది. దీని నోటిలో పళ్లు వంకరగా ఉండి గొంతు వైపు ముడుచుకుంటాయి.

పాము ఏ కప్పనైనా మింగినపుడు అది గొంతులోకి వెళ్లి కూడా గిజగిజా తన్నుకుంటూ ఉంటే వంకర పన్ను దాని శరీరంలోకి బాగా దూసుకుపోతుంది. పాము ఎదుగుతున్నా దాని చర్మం ఎదగదు. అందుకనే పాత బిగుతు చర్మాన్ని కూసం రూపంలో వదిలేసి వదులైన కొత్త చర్మాన్ని ఏర్పరచుకుంటుంది. ఆ సమయంలో పాము ఏరకమైన ఆహారాన్నీ తీసుకోదు. కొత్తచర్మం ధరించగానే ఎంతో ఆకలిగా ఉంటుంది. కడుపు నింపుకునే ఆరటం ఎక్కువగా ఉంటుంది. చచ్చిపోకుండా ఒక సంవత్సరం తిండి లేకుండా పాము జీవితాన్ని గడపగలదు.

**సాగర సర్పాలు :**

సముద్రంలో ఉండే పాములు త్రాచుపాము, కట్లపాముల కంటే ఎన్నోరెట్లు విషపూరిత మయినవి. క్రోకర్సు, సీస్నేక్స్, పొడవైన పసుపు పచ్చని పాము వంటి 55 రకాలయిన సముద్రపు పాములున్నాయి. సాగర సర్పాలు నీటి లోపల సునాయాసంగా ఈదగలవు భూమిమీద వాటి చలనం చాలా క్ష్లిష్టతరంగా ఉంటుంది. గాలి పీల్చుకోవడానికి ఇవి తరచు నీటిపైకి వస్తూ ఉంటాయి. గాలి పీల్చకుండా దాదాపు ఆరు గంటల సేపు నీటి అడుగున ఉండగలవు.

సముద్ర పాములు సాధారణంగా తీర ప్రాంతాలలో గల రాతి పగుళ్లలోను, చెట్ల వేర్లకు లేదా ఓడ రేవు గోడలకు అంటిపెట్టుకుని ఉంటాయి. సముద్రం ప్రశాంతంగా ఉన్నప్పుడు, సూర్యోదయ సమయంలో వందలాది పాములు నీటి ఉపరితలంపై తల ఎత్తి విశ్రాంతి తీసుకోవడం గమనించవచ్చు. వీటి ముఖ్య ఆహారం చేపలు.

సముద్రపాములు చాలా పిరికివి. అలికిడి అయితే వేగంగా మరొక ప్రాంతానికి పారి పోతాయి. ఇది కాటు వేయడం చాలా అరుదు. బుసగొట్టి ప్రత్యర్థిని బెదిరించవు. త్రాచుపాము మాదిరి వీటికి పడగ ఉండదు. ఇవి కాటు వేసిన వెంటనే సన్నని సూది పెట్టి పొడిచి నట్లవుతుంది. ఆ తరువాత అర్ధ గంట నుండి ఎనిమిది గంటల లోపు విష ప్రభావం కన్పిస్తుంది. కాటు వేసిన 12 గంటలలో మనిషి మరణిస్తాడు.

ప్రమాద రహితమని ఈ పాములను భావించినప్పటికినీ ఆసియన్ తీర ప్రాంతాలలోని బెస్తవారు ఎదుర్కొనే ప్రధాన సమస్యలలో ఇదొకటి. వట్టికాళ్లతో సముద్రంలోకి అడుగుపెట్టిన బెస్తవారు అనుకోని పరిస్థితులలో ఈ పాము కాటుకి గురి అవుతున్నారు.

సాగర సర్పాలకు శత్రు భయంలేదు. యధేచ్ఛగా సముద్రంలో విహరిస్తూ ఉంటాయి. సముద్ర గద్దలు అలలపై తేలి ఆడే పాములను రెప్ప పాటులో తన్నుకుని పోయి వాటి మాంసాన్ని విందు ఆరగిస్తాయి. అందంగా ఉండే వాటి చర్మాన్ని ఉపయోగించి పర్సులు, సంచులు తయారు చేస్తారు.

**పాము కాటుకు మందు :**

పాము కాటుకు మందు పాము విషమే. వాటి విషంనుండి ఈ మందు తయారు చేస్తారు. ప్రపంచంలో ఖరీదయిన వస్తువులలో పాము విషం ఒకటి. ఒక గ్రాము పాము విషం విరుగుడు మందు వేల రూపాయల్లో ఉంటుందిట. బ్రతికుండే పాము చాలా విలువైనదన్నమాట. ప్రపంచంలోనే అరుదైన పాములు పట్టేవారి పారిశ్రామిక సహకార సంఘం మద్రాసులో 1978లో అవతరించింది.

ఒక గ్రాము త్రాచు పాము విషం విరుగుడు మందు తయారు కావడానికి 10 త్రాచు పాముల నుండి విషం పిండాలి. మరొక రకం పామయితే 100 రకాల పాముల నుండి పిండాలి. సముద్ర పాము కాటుకు పనికి వచ్చే మందు ఖరీదు చాలా ఎక్కువగా ఉంటుంది.

గిరిజనులు తాము పట్టుకున్న పాములను నెలరోజుల కంటే మించి తమ రక్షణలో ఉంచుకోరు. ఈలోగా వారానికొక సారో, పది రోజుల కొకసారో పాము నుండి విషం పిండేస్తారు. ఆ తరువాత పాముకు గ్లూకోజ్ ఇస్తారు. పామును ఎక్కడ పట్టారో అక్కడ వదిలేస్తారు. అంటే పట్టుపడిన పాము ప్రాణాలు కోల్పోదు సరికదా మరింత ఆరోగ్యంగా ఆ తరువాత బ్రతుకుతుంది.

పాములను పట్టుకుని ప్రయోగ శాలల్లో ఉంచి వాటి విషం తీసే సంస్థలు తమిళనాడులో చాలా ఉన్నాయి. అయితే ఇక్కడొక చిక్కు ఉంది: పాములను పట్టి ఎంత భద్రంగా రక్షించినా అవి కొద్ది కాలానికి చనిపోతాయి. అందుకే గిరిజనులు వాటిని తిరిగి వదిలి వేస్తూ ఉంటారు.

**ప్రథమ చికిత్స :**

పాముకాటు సాధారణంగా కాళ్లకు గాని, చేతులకు గాని సంభవిస్తుంది. మోచేతి పైన లేదా మోకాలుపైన కాటు వేసిన ప్రదేశాన్ని బట్టి రబ్బరు, తాడు లేదా గుడ్డతో రెండు కట్లు కట్టాలి. వీలయినంత వెంటనే వైద్యుని దగ్గరకు తీసుకు వెడితే విషం విరుగుడు మందు యాంటీ వెనమ్ ఇంజక్షన్ ఇచ్చి కావలసిన వైద్య చికిత్స చేసి ప్రాణాపాయం నుండి కాపాడగలుగుతాడు.

సర్పదష్టుడిని చల్లని నీడ ప్రాంతంలో కూర్చోపెట్టాలి. ఎటువంటి ఆహారం, పానీయం ఇవ్వకూడదు. మత్తు పదార్థాలు అసలు పనికిరావు. నోటిలో చొంగ అడ్డుపడితే వెంటనే తొలగించాలి. కట్టిన కట్లు అరగంటకు మించి ఉంచకూడదు. ఆ విధంగా కట్లు ఉంచేస్తే ఆ ప్రాంతం చచ్చుపడిపోయే అవకాశం ఉంది.

క్రింద కట్టు 15 సెకనులు వదులు చేసి బిగించి తరువాత పై కట్టు 15 సెకనులు వదులు చేయాలి. అప్పుడు రక్త ప్రసరణకు ఆటంకం ఉండదు. కాటు వేసిన పామును చంపితే పామును బట్టి రోగ లక్షణాలు గమనించవచ్చు. ఒక్కొక్కప్పుడు అది విష సర్పం కాకపోవచ్చు. మనము నివసించే ప్రాంతంలో నెమలి, ముంగీసలున్నచో పాములు మసలవు. పొగతో పాములు దూరంగాపోతాయి.

# వేయి పడగల నీడన భావి భారతం!

- నరేష్ నున్నా

(క్రిందటి సంచిక తరువాయి)

ఈ నేపథ్యంలో 1980ల నాటికి సంఘ్ పరివార్ పరివారం మదిలో తళుక్కుమన్న అద్భుతమైన యోచనే అయోధ్యలో రామాలయ నిర్మాణం. అల్పసంఖ్యాక అగ్రబ్రాహ్మణీయ వర్ణాల కొమ్ముకాసిన రాముడిని, 'అందరికీ దేవుడి'ని చేయగలిగిన జాణతనంతోనే, అయోధ్యలో 'రామాలయ నిర్మాణం' యావత్ హిందువుల లక్ష్యంగా చేసే కార్యసాధనలో నిమగ్నమయింది సంఘ్ పరివార్. ఆర్ ఎస్ ఎస్, బిజెపి, విహెచ్పి, భజ్‌రంగదళ్ ... వంటి శాఖలతో విస్తరిస్తున్న పరివార్‌కు, శివ సేన వంటి సంస్థలు కూడా తోడయ్యాయి. హిందుత్వ నినాదంలో పరివార్‌కు, శివసేనకు సామ్యం ఉన్నా, మౌలికంగా రెండింటికీ ఎంతో వ్యత్యాసముంది. తన రాగానికి అనుగుణంగా ప్రజల నడకల్ని మార్చాలన్న లక్ష్యంతో పరివార్ ప్రారంభమయితే, ప్రజల నడకల్ని ఇట్టే ప్రభావితం చేసే రాగాన్ని ఎంచుకోవడమే లక్ష్యంగా శివసేన ప్రారంభమయింది. మరికొంత వివరాలలోకి వెళితే, ఏదో విధంగా ప్రజల్లో చీలికలు తెచ్చి పబ్బం గడుపుకోవడమే లక్ష్యంగా ప్రారంభమైన అతి సాదాసీదా ముఠా 'శివ సేన'. 1966లో అది ప్రారంభమైనప్పుడు హిందూ - ముస్లిం వర్గాలు దాని దృష్టిలో లేవు. 'మహా రాష్ట్రీయులకు న్యాయం జరగాల'న్నది తొలినాళ్లలో శివసేవ జపించిన నినాద మంత్రం. స్థానికేతరులైన మదరాసీలపై స్థానికులకు ఉన్న స్పర్థను రెచ్చగొట్టడం ద్వారా వెలుగులోకి రావాలని ప్రయత్నించింది. అయితే, ఈ నినాదం వల్ల స్థానికేతర ధనికవర్గాలైన గుజరాతీలు శివసేనకు వ్యతిరేకమవడం, తద్వార మామూళ్లు నిలిచిపోవడం వల్ల నాలికను మరోలా తిప్పేసింది. మతపరమైన చీలికలు తేవడమే ఎక్కువ లాభదాయకమన్న గట్టి నిర్ధారణకు వచ్చి, మళ్లీ రంగు మార్చుకుంది. సంఖ్యాపరంగా, సామాజికంగానే గాక, ఆర్థికంగా కూడా బడుగువారైన భారతీయ ముస్లింలలో బొంబాయి ముస్లిం మరింత బలహీనుడు, దాంతో 'శివసేన' మరింత పేట్రేగి, ఇప్పుడు ఇంత నియంతృత్వ శక్తిగా ఎదగగలిగింది.

దీనికి సమాంతరంగా సామాజిక పరిణామాల్ని గమనిస్తే, బాబాసాహెబ్ అంబేద్కర్ వెలిగించిన సామాజిక న్యాయ సాధన ప్రయత్నాలు, దాదాసాహెబ్ గైక్వాడ్ భూమి హక్కుల సాధనోద్యమాల మీదుగా, రామ్‌మనోహర్ లోహియా రగిలించిన బడుగు, దళిత వర్గ చైతన్యోద్యమాలుగా వికసించి, ఒక social transformationకి దారితీస్తున్న పరిస్థితులు ఏర్పడుతున్నాయి. శతాబ్దాల ఈ అణిచి వేతను, కొత్తగా అధికారాల్లోకి వచ్చిన నియోబ్రాహ్మణ వర్గాలు కూడా మరింత బలంగా కొనసాగించడం మీద ఒక తిరుగుబాటుకు దళిత వర్గం సమాయత్తమవుతోంది. ఈ పరిణామాలు సహజంగానే నియోబ్రాహ్మణ వర్గాలకు రుచించలేదు.

కనుక, హిందూరాజ్య స్థాపనకు పూనుకున్న బ్రాహ్మణ వర్గాలకు. దళిత సామాజిక ఉన్నతి నచ్చని నియో బ్రాహ్మణ వర్గాలకు 'రామాలయ నిర్మాణ' నినాదం, దృష్టి మళ్లింపు మంత్రంగా తోచింది. మండల కమిషన్ సిఫార్సులు, వాటి అమలు వల్ల కలిగిన పరిణామాలతో వీరి జవసత్వాలు

---

నరేష్ నున్నా, ప్రముఖ పాత్రికేయుడు, ప్రస్తుతం విశాఖపట్టణంలో నివాసం.

మరింత పుంజుకున్నాయి. ఇక అంతం కాదిది ఆరంభమన్నట్లు, అద్వానీ రథయాత్రతో ప్రారంభమై, బాబ్రీ మసీదు కూల్చివేత, తదనంతర మారణహోమాల నెత్తుటి బాటలో హస్తినలో అధికార పీఠం వరకూ నల్లేరు మీద బండి నడకలా సాగింది 'హిందుత్వ' జైత్రయాత్ర. అధికారాన్ని కైవసం చేసుకోవడం, మాజీ సోషలిస్టులు, బ్రాహ్మణ వ్యతిరేకోద్యమ సారథులు, దళితోద్ధారకులు, అవకాశవాదులు, జార్జి ఫెర్నాండెజ్‌లు, కరుణానిధులు, శరద్ యాదవ్‌లు, అజిత్ సింగులు... ఇత్యాదులతో ఊడిగం చేయించుకోవడం ... వంటి అంశాల కంటే, భారతదేశంలోని ముస్లింలను విలన్లుగా, జాతి మొత్తానికి విద్రోహులుగా చిత్రించి, నమ్మించడమే సంఘ పరివార్ సాధించిన ఘన విజయం. అగ్రవర్ణాల నుంచి అట్టడుగు దళిత వర్ణాల వరకూ అందరికీ ఉమ్మడి శత్రువుగా ముస్లింని నిలబెట్టగలిగింది. భిన్న సంస్కృతుల మధ్య, విభిన్న భాషల మధ్య బ్రతుకుతున్న భారతీయ ముస్లింలందరినీ అభద్రతతో, భయంతో 'ఏకం' చేయగలిగింది. దాదాపు ఐదువేల ఏళ్ళుగా విద్య, విజ్ఞానం, అధికారం, వాణిజ్యం, సంపద... వగైరాలను తమ గుప్పెట్లోనే ఉంచుకొని, ధర్మమని, కర్మమని 95 శాతం స్త్రీ, శూద్ర, బడుగు, దళిత వర్గాలను చీకట్లోనే ఉంచేసిన అగ్రవర్ణాలు, సహస్రాబ్దాల, శతాబ్దాల తమ తప్పిదాలను మరుపు గదుల్లోకి దాచేయగలగడమే వారి తిరుగు లేని విజయానికి నిదర్శనం. మరీ మూడేళ్లుగా కేశవ్ బలిరామ్ హెడ్గెవార్ భవనం పిలుపులకు శరభ, అశ్శరభ అంటూ బదులు పలికి తమ రక్తాన్ని, ప్రత్యర్థుల రక్తాన్ని వరదలై పారిస్తున్న 'పరివారం'లో ఎక్కువ శాతం దళిత, ఆదివాసీ జనులు కావడమే వారి అఖండ విజయానికి దాఖలా.

అన్ని అవకాశాలు నిరాకరింపబడి, అంధకారంలో ఉన్న మెజారిటీ వర్ణ / వర్గాలకు తొలి సారిగా కాస్తంత అవకాశాలు అంది వచ్చింది ముస్లిం రాజుల పాలనలోనే, స్వమతాభిమానులైన ముస్లిం రాజుల పాలన సాగిన ప్రాంతాలలో మతమార్పిడుల సంఖ్య సాపేక్షంగా తక్కువేనని చారిత్రక గణాంకాలు సూచించడం ఒక paradox.

దీనిని బట్టి కూడా, శూద్ర, దళిత కులాల వికాసానికి మత మార్పిడులు మాత్రమే కారణం కాదని తెలుస్తుంది. ఈ కారణాల దృష్ట్యా కూడా దిగువ వర్ణాలకు ముస్లింలపై ద్వేషం ఉండే అవకాశం లేదు. తమ స్థలాలు, ప్రదేశాలలోకి మరో ప్రాణి చొరబడితే, చొరబడే ప్రయత్నం చేస్తే జంతువులో 'అభద్రతాభావం', ఫలితంగా 'ఆగ్రహం' కలుగుతాయి. అనాది జంతు వాసనల వల్ల మనిషిలో కూడా ఈ territorial instinct ఉంటుంది. దీని వల్ల సహజంగా రేగిన ఘర్షణలకి 'మతం' రంగు పులమబడింది పరివార్ విజృంభణ తర్వాతే. అసత్యాలకు, అర్ధ సత్యాలకు ద్వేషాన్ని కలిపితే అవి సంపూర్ణ సత్యాలయి కూర్చున్నట్టు అవి మతకలహాలే అన్న భావం అందరి మనసుల్లో స్థిరపడింది.

అయితే, ఓట్లు రాల్చే 'తారక' మంత్ర శక్తి క్రమేణా సన్నగిల్లుతుందని గ్రహించింది పరివార్. విహెచ్‌పి సాధుపుంగవులు, స్వయం సేవక వీరాగ్రేసరులు గొంత చించుకొని పొలికేకలు పెట్టినా, కొన్ని రాష్ట్రాల అసెంబ్లీ ఎన్నికలలో, 30వేల శాఖలతో విలసిల్లుతున్న 'హిందూరాజ్య ప్రయోగశాల' గుజరాత్‌లో స్థానిక సంస్థల ఎన్నికలలోనూ పరివార్ పరివారం డీలా పడిపోయింది. కరుడు గట్టిన

రామభక్తులను మినహాయిస్తే, మిగతా సామాన్య భక్తకోటికి అయోధ్యలో ఆలయం కంటే, తమకు గుడ్డ, గూడు ముఖ్యమని, కడుపులోకి పట్టెడన్నం ఇంకా ముఖ్యమని అర్థమయింది. మందిరాలు కడతామన్న వారికంటే, మంచినీళ్లు పోస్తామన్న మాటలే నచ్చడం వల్లనే ఎన్నికల ఫలితాలు తారుమారయ్యాయి. విశ్వశాంతికి, లోకకల్యాణానికి, పారలౌకిక మోక్షసాధనకు పవిత్ర సాధుశ్రేష్ఠులు నిర్వహించే మహాయాగాలకు కూడా 'ప్రజాబలం కరవవడంతో భవిష్యత్ ప్రశ్నార్థకంగా కనిపించింది హైందవ వీరులకి ('ప్రశ్న' చిహ్నం... ఒంపు తిరిగి, పదును తేలి, నెత్తుటి రుచికై అంగలార్చే కొడవలిలా ప్రతీకాత్మకంగా వారికి తోచడం బహుశా ఒక అనివార్య యాదృచ్ఛికత కావచ్చు).

కచ్చితంగా ఈ 'సంక్షోభ' సమయంలో జరిగిందే గోద్రా దురంతం. 'మతం' పేరిట రగిలిన మంటలకు బోగీలో అన్నెం పున్నెం ఎరగని కర సేవకులు మసిబొగ్గులై మిగిలారు. హతమైనది హిందువులు కనుక, 'హంతకులు ముస్లింలు' అన్నది ఒక ఉపరితల తర్కం. బొంబాయి అల్లర్లలో డాక్ యార్డ్‌లో హతమైన Mathadi కార్మికులు, జోగేశ్వరిలో బలైన Bane కుటుంబం హిందువులు కనుక, ముస్లింలే దోషులన్న అదే ఉపరితల తర్కంతో మారణహోమం జరిగింది. కానీ, శ్రీకృష్ణ కమిషన్ నివేదిక ముస్లింలు నిరపరాధులని తేల్చినప్పటికీ, ఆ ఉపరితల తర్కంలోని లోపాన్ని (సౌలభ్యం కోసం) గుర్తించక పోవడం గమనార్హం. ఎక్కడ అల్లర్లు జరిగినా ముస్లింలే ఆరంభిస్తున్నట్లు పైకి కనిపిస్తోంది. వారు మొదటి రాయి విసిరేలా సంఘటనల్ని సృష్టించడమో, లేదా వారే మొదటి రాయి వేసినట్టు అందర్నీ నమ్మించడమో జరుగుతుందని ఎన్నో దర్యాప్తు కమిషన్లు పేర్కొంటున్నా, దేశంలోని 12.4 శాతం ముస్లింలలో 80 శాతం మంది అల్లర్ల బాధితులై అల్లాడిపోతున్నా ఈ ఉపరితల తర్కంలో ఎటువంటి మార్పు ఉండకపోవడం మరింత గమనార్హం. అలానే, గోద్రా దురాగతంలో 'ముస్లింల పాత్ర'ను మించి, కనులకు కనిపించని సత్యమేదో వెలికి రావల్సే ఉంది. అయితే, గోద్రా తదనంతరం కూడా 'అవసర'మైన మేరకే సత్యాలు వెలికి వచ్చాయి. గుజరాత్‌లో ముస్లింల మహామేధం జరిగి పోయింది. అణచగలిగినప్పుడు అల్లర్లను అదుపు చేయకపోవడం ఒక వ్యూహం/ఎత్తుగడ. కానీ, గుజరాత్ ప్రభుత్వానికి ఈ చౌకబారు ఎత్తుగడలతో పరోక్ష మద్దతునందించవలసిన అగత్యం పట్టలేదు. ముస్లింల ఊచ కోత - 'వ్యధిత హృదయ ప్రతీకారమని / ప్రతిస్పందనమని' నిర్భీతి (నిర్లజ్జ)గా ప్రకటించాడు స్వయం సేవక కేసరి, గుజరాత్ సారథి నరేంద్రమోడి. యావత్ సభ్య మానవ ప్రపంచం నిర్ఘాంత పోయింది. విశాల హిందూ రాజ్య స్థాపనకి వీరబలి జరిగింది. తొలి విజయ సూచికంగా కాషాయ పతాకం గుజరాత్ అసెంబ్లీ మీద రెపరెపలాడింది. మంగళ తూర్యారావాలతో దేశమే పిక్కటిల్లింది. నరేంద్రమోడి సింహాసనాధిష్టుడయ్యాడు. ప్రగతిశీలక, పరమ లౌకిక, కవితా హృదయ, కాషాయవాది వాజ్‌పేయి దీవించారు. హైందవ సర్వ సేనాని అధ్వానీ 'అస్తు' పలికారు.

సమాధుల దగ్గర పూలు ఏరుకునే కాంగ్రెస్ నేతృత్వంలోని విపక్షాలు ముస్లింల ఊచకోత పరిణామాలను తమకు అనుకూలంగా మార్చుకునేందుకై చూపిన అత్యుత్సాహం; ముస్లింల దైన్యజీవనాన్ని మరింత దుర్భరం చేసే వారి మతనాయకుల తాజా ఫత్వాల వంటి అంశాలు కూడా మోడి విజయానికి కారణమంటున్న విశ్లేషకుల అంచనాలు కూడా కొంత వరకూ కరెక్టే. గుజరాత్

అల్లర్లను బూతద్దంలో చూపి, గుజరాత్ హిందువులను భూతాలుగా ప్రపంచంముందు నిలబెట్టిన మీడియా వల్ల కూడా మనస్తాపం చెందిన ఆ రాష్ట్ర హిందూ వోటరు తన ఆగ్రహాన్ని మోడిగెలుపు ద్వారా ప్రకటించాడని మరి కొందరు విశ్లేషిస్తున్నారు. కానీ, కఠిన శిక్షార్హులని, బ్రతికేందుకు కూడా అనర్హులని తేలిపోయిన వారి 'మానవ హక్కుల' గురించి పట్టించుకునే వారి పట్ల మధ్య తరగతి, ఎగువ మధ్య తరగతి ప్రజలకు తీవ్రమైన ఆగ్రహం కలుగుతుంది. అలానే, జీవించే అర్హత కోల్పోయిన ముస్లింల పక్షాన ఉన్న 'మీడియా' మీద కూడా అటువంటి ఆగ్రహమే కలిగింది గుజరాత్ హిందువుకి.

అయితే, మీడియా వల్ల దొర్లిన లోపాన్ని ప్రస్తావించుకోవాలి. 'When we debunk a fanatical faith or prejudice, we do not strike at the root of fanaticism. We merely prevent its leaking out at a certain point, with the likely result that it will leak out at someother point. Thus by denigrating prevailing beliefs and loyalties, the militant man of words unwittingly creates in the disillusioned masses a hunger for faith...' అంటాడు Eric Hoffer. గుజరాత్‌లో కచ్చితంగా జరిగిందిదే. మీడియా అనుద్దేశపూర్వకంగా కల్పించిన విశ్వాస దాహాన్ని తీర్చుకోవడానికి గుజరాత్ హిందూ జనసామాన్యం పోలింగ్ బూత్‌ల దిశగా పరుగులెట్టింది. అయితే, చివరికి అక్షరధామ్ ఘోరకలితో సహా ఈ అంశాలన్నీ కమల వికాసానికి దోహదపడిన ఉపాంశాలు మాత్రమే.

ఇప్పుడు మళ్లీ మన unique, లేదా strange మతోన్మాదం దగ్గరకే వద్దాం. అలా వచ్చే ముందు కొన్ని ప్రాథమిక ప్రశ్నలు వేసుకుందాం!

సంఘ్‌పరివార్ నాయకత్వమంతా బ్రాహ్మణ్య వర్గాలతో నిండిపోవడానికి కారణమేమిటి?

వీరజవానుల సంస్మరణ దినాలు, విజయ దివస్‌లు సంఘ్ పరివార్ ఆధ్వర్యంలో మాత్రమే జరిగే పండుగలు కావడానికి కారణమేమిటి?

'ముసల్మాను' అనే శబ్దంలో 'పాకిస్తాన్' అనే పర్యాయ శబ్దం ధ్వనించి, పరమ వీర దేశభక్తితో పరివార్ పేట్రేగిపోవడంలో మర్మమేమిటి?

ఎంత జాతి విద్వేషాన్ని (National animosity) చిమ్మగలిగితే అంత 'దేశభక్తి' ప్రపూర్ణుడిగా కీర్తింపబడటంలో కిటుకేమిటి?

ఏనాడూ తమ చేత మనుషులుగా గుర్తింపబడే 'అదృష్టా'నికి కూడా నోచుకోని అస్పృశ్యులు, దళితుల మతమార్పిడులను క్రైస్తవ మతగురువుల సజీవదహనాల సాక్షిగా వ్యతిరేకించడానికి కారణమేమిటి?

ధర్మరక్షణకి, మత సంరక్షణకి, సంప్రదాయ పరిరక్షణకి, విశ్వశాంతికి, వసుధైక కుటుంబ శ్రేయస్సుకి, సర్వేజన సంక్షేమానికి భారత బ్రాహ్మణీయ వర్గాలు పడే తపన, చూపే చొరవ, చేసే

త్యాగం, చిందించే రక్తాలకు వారిలోని లోకకల్యాణాభిలాషే కారణమా? లేక వారి వర్ణ / వర్గ ప్రయోజనాల పరిరక్షణానురక్తే కారణమా?

ఈ సులభ ప్రశ్నావళికి, ఐదువేల ఏళ్ల చరిత్రను చూసి, దాని సారాన్ని అర్థం చేసుకున్న intuitive జ్ఞానమే సమాధానం ఇచ్చుకోగలదు కనుక, ఇప్పుడు అసలు ప్రశ్నలోకి వెళ్తాం :

విదేశాలలో కనిపించే మతోన్మాదానికి, మన దేశంలో హిందూ మతోన్మాదానికి మధ్య భేదం ఏమన్నా ఉందా? ఉంటే ఏమిటది?

Fanaticismలో విదేశీ, స్వదేశీ భేదాలు కచ్చితంగా ఉన్నాయి. ఈ భేదం పద్ధతులు, పరిణామాలు, ఫలితాలు, వాటి క్రూర తీవ్రతలకు సంబంధించినది కాదు. అంతకంటే మౌలికమైనది. తర్కానికి, విచక్షణకి నిలవని కొన్ని సహజాత ఆదిమ మృగ లక్షణాలు ప్రేరేపించి, విజృంభించి, నిలువెల్లా కమ్మేసిన దశలో తమకే తెలయని ఆ శక్తుల ఆజ్ఞలకు లోబడి మారణహోమాలకు తెగబడ్డారు అక్కడ మతోన్మాదులు. ప్రాచీన, మధ్యయుగాల భారతదేశంలో కూడా ఇదే రకమైన ఉద్వేగ మతోన్మాదమే కనిపిస్తుంది. కానీ, వర్తమాన భారతంలో తెర వెనక శక్తుల కుతర్కానికి, కుతంత్రాలకు ఫలితమైన మతోన్మాదమే ఉంది. ఒళ్లు తెలియని ఆగ్రహం లేదు; పథకం ప్రకారం తెచ్చిపెట్టుకున్న ఆగ్రహాభినయమే ఉంది. అంటే విదేశీ మతోన్మాదం వెనక చోదక శక్తి instinctive అయితే, హిందూ మతోన్మాదం engineered, manipulated. ఏ మేరకు తెర ముందు నిలిచి రెచ్చగొట్టాలో, ఎప్పుడు తెరవెనకకు నడిచి prompting చెయాలో చాలా స్పష్టంగా తెలిసిన వర్గాల వ్యూహరచనే ఇక్కడి మతోన్మాదానికి మూలం. ఒక అసత్యాన్ని సత్యమని నమ్మించే ప్రయత్నం చేస్తున్నప్పుడు, ప్రమత్తతకు లోనయిన ప్రచారకుడు ఆ trapలో తానే పడి, తాను కూడా దానిని సత్యమని నమ్మే విచిత్ర స్థితికి వస్తాడు. కానీ, ఇక్కడ అసత్య ప్రచారకులకు క్షణమాత్రమైనా ఏమరుపాటు లేదు. ఉండదు.

ఈ strange, stratagic హైందవ మతోన్మాదం వేసిన ఉచ్చులో విశాలభారతం ఇరుక్కుపోనున్నదనడానికి నాందే గుజరాత్‌లో మోడి విజయం.



Fanaticism వ్యక్తిగత, సామూహిక స్థాయిలనే రెండు స్థాయిలలో ఉంటుంది. పుట్టుకతోనే తాను అందరి కంటే అధికుణ్ణని భావించడం, అలా భావించడానికి కించిత్ అయినా వెరవకపోవడం, సంశయపడక పోవడమే individual fanaticism. భారత బ్రాహ్మణీయ వర్గాన్ని లోహియా మాటల్లో వశిష్ఠ బ్రాహ్మణ్య వర్గమని, fanatic elementని వదుల్చుకొని, సంస్కారవంతమైన వర్గాన్ని వాల్మీక బ్రాహ్మణ్య వర్గమని విభజిస్తే, వాల్మీక బ్రాహ్మణుల సంఖ్య నానాటికీ తగ్గిపోతూ, వాల్మీక శూద్ర దళిత వర్గాలు వశిష్ఠ శూద్ర దళిత వర్గాలుగా రూపాంతరించడమే వర్తమాన భారతంలో మహా విషాదం !

(సమాప్తం)

# రుబాయీ ప్రేమైక తాత్వికుడు ఉమర్ ఖయ్యామ్

– నాగులూరు దయాకర్

మరణం అత్యంత సత్యవంతమైనది. దాన్నుంచి రాజులు రారాజులు ఎవ్వరూ తప్పించుకోలేరు. మనిషిఎంతో అహంకారంగా, నిర్దాక్షిణ్యంగా, నిష్టగా, నిర్లక్ష్యంగా జీవిస్తూ వుంటాడు. అయితే, మరణం అతన్ని ఎప్పుడూ అంటిపెట్టుకొనే వుంటుంది. మరణించినప్పుడు అన్ని ఆలోచనలు అతన్నుంచి పూర్తిగా దూరమవుతాయి. సజీవంగా వున్న ప్రతి వస్తువు మరణిస్తుంది. అన్ని సజీవ వస్తువుల లాగే మనిషి కూడా మరణిస్తాడనే సత్యాన్ని మనిషి ఇంకా జీర్ణించుకోలేక పోతున్నాడు. మనిషికి జీవితం పట్ల, మరణం పట్ల అవగాహన లేకపోవటం వల్లే అతని జీవితం నిత్యం దుఃఖపూరితమై వుంది. వీటి పట్ల అవగాహన వున్నప్పుడు అతను జీవితం పట్ల ప్రేమను కలిగి వుంటాడు. ప్రేమైక జీవిగా ప్రకృతిలో విలీనమైపోతాడు. సుఖమయ జీవితాన్వేషకుడవుతాడు. అటువంటి అవగాహన కలిగిన సుఖవాదిగా, పారసీ కవిగా, రుబాయీ ప్రేమైక తాత్వికుడుగా మనకు ఉమర్ ఖయ్యామ్ దర్శనమిస్తాడు.

''అంతములేని యీ భువనమంత పురాతన పాంథశాల; వి
శ్రాంతి గృహంబు; నందు నిరుసంజలు రంగుల వాకిళుల్; ధరా
క్రాంతులు పాదుషాలు బహరామ్ జమిషీడులు వేనవేలుగాం
గొంత సుఖించి పోయిరెటకో పెఱవారికిం జోటొసంగుచున్.''[1] అంటాడు ఖాయ్యామ్.

అనంతమైన యీ భూప్రపంచం ఒక పురాతనమైన సత్రం. ఇది రాత్రి, పగలు అనే రెండు వాకిళ్ళు కలిగిన విశ్రాంతి గది. ఇక్కడికి మహారాజులు, మహారాణులు వచ్చి కొంత సేపు సుఖించి ఎక్కడికో పోయారు ఇతర్లకు ఆ అవకాశాన్ని ఇస్తూ. ఎంతటి గొప్ప వాళ్ళకైనా యీ ప్రపంచంలో చిరస్థాయిగా వుండే అవకాశం లేదు. ఇలా మానవ జీవిత అస్తిత్వాన్ని ఖయ్యామ్ ఎంతో తర్కబద్ధంగా విశ్లేషించాడు.

మనిషి యీ ప్రపంచంలోకి తన ఇచ్ఛాపూర్వకంగా రాలేదు. ఎందుకు వస్తున్నాడు? ఎందుకు వెళ్ళిపోతున్నాడు? యీ ప్రపంచ అస్తిత్వ స్వభావం ఏమిటి? పుట్టటం మరణించడమే యీ ప్రపంచం అస్తిత్వమా? పుట్టుకకు ముందేమిటి? మరణం తరువాత ఏమిటి? ప్రపంచం అంతా ఇలాంటి (అ) ప్రధాన భ్రమలతో నిండి వుంది. మనిషి జీవితం అర్థరహితంగా వుంది. అందుకే ఖయ్యామ్ జన్మించిన మనిషిలో శాంతి సౌఖ్యాలు వుండవంటాడు. ''ఎక్కడ నుంచి అయినా కానీ, / ఈ లోకంలోకి దిగి రాకుండా తప్పించుకోగలిగినవాడే ధన్యుడు / తల్లి గర్భం నించి బైటపడని వాడొక్కడే ఎరుగును / నిజమైన శాంతి సౌఖ్యాలు''[2] అని అంటాడు. జనన రహితమైన మనిషే నిజమైన సుఖానుభూతిని పొందుతాడని. ఖయ్యామ్ ఎంతో గొప్ప తాత్వికతతో అస్తిత్వాన్ని, అస్తిత్వ రహిత స్థితిని ఆవిష్కరించాడు.

---

నాగులూరు దయాకర్, రిసెర్చ్ స్కాలర్, డిపార్ట్‌మెంట్ ఆఫ్ ఫిలాసఫీ,
యస్.వి. యూనివర్సిటి, తిరుపతి.

ఉమర్ ఖయ్యామ్ 11,12 శతాబ్దాలలో జీవించాడు. ఇతనికి పెళ్లైనట్లు, సంతానం వున్నట్లు ఎక్కడా ఆధారాలు లేవు. ప్రకృతి ఆరాధన, మంచి భోజనం, పుస్తక పఠనం, మధువు, ప్రియురాలు ఇవే తన ప్రపంచంగా జీవించాడు. ''చెట్టు నీడలో కూచున్న మనకేం కావాలి? / ఓ రొట్టె, ఓ కావ్యం, మధువు / నా పక్కన కూచుని నువ్వు పాడితే ... / ఎడారి స్వర్గమవుతుంది /''[3] అని ఖయ్యామ్ నిత్యం మధువుని సేవిస్తూ, మగువ వడిలో సుఖానుభూతిని పొందాడు. ఖయ్యామ్ భగవంతుణ్ని పూజించలేదు, ప్రేమించాడు. అందుకే తన రుబాయీలలో దేవుణ్ని ఆత్మీయుణ్ని చేసి స్తుతిస్తాడు, ప్రశ్నిస్తాడు. ''ప్రభూ, ఆకర్షిస్తూ పిలిచే సారాయి కొట్టువేపు / తూలుతున్న నా తప్పటడుగులు దారితప్పి వెళ్ళినా, / వొణుకుతున్న నా చేతులపై దయతలచి / మధు కలశాన్ని మాత్రం నా నుంచి లాగెయ్యకు /''[4] అంటాడు. తను సారాకొట్టు దారి తప్పిన పర్వాలేదట. కానీ తన నుండి మధువుని లాక్కోవద్దని భగవంతుణ్ని ప్రార్థిస్తాడు. ఇలాగే మరో సందర్భంలో తన లోపాలన్నింటికి కారకుడు భగవంతుడే నంటాడు. ''నాలో ఎన్నో లోపాలున్నాయంటావా? / ఉండనీ నేనేం చెయ్యను? / విధి ఫలకం పైన చిత్ర జగత్కారుడు/ నన్నా విధంగా రూపొందించాడు''[5] అని అంటాడు. భగవంతుడు సర్వాన్ని చిత్రించే సర్వశక్తి సంపన్నుడు (omnipotent), సర్వాంతర్యామి, (omnipresent), సర్వం తెలిసిన సర్వజ్ఞుడని (omniscient)అన్ని మతాలు చెపుతున్నాయి. కాబట్టి అంతటి మహానుభావుడే తన లోపాలను కూడా చిత్రించాడని, మనిషిగా తాను నిమిత్తమాత్రుడ్నని ఖయ్యామ్ తన లోపాలను భగవంతుడి లోపాలుగా చూపుతాడు. జీవితంలోని ప్రతి దైవాంశమే, దేవుడే యీ శరీరాన్ని, మనస్సుని ఇచ్చినప్పుడు అవి తప్పుడు పనులు చేస్తే ఆ తప్పు ఎవరిది? కుండ సొట్టపోతే తప్పు కుమ్మరిదేనంటాడు. కుండది కాదంటాడు, తప్పు చేశానని పశ్చాత్తాపం చెందనక్కర్లేదు, దేవుడే తన తప్పుని తానే సరిచేసుకొని మనిషిని మన్నిస్తాడని, ఖయ్యామ్ మనిషిని వూరడిస్తాడు. ఇలా ఖయ్యామ్ ఆచార వ్యవహారాలను పాటించకుండా స్వతంత్రంగా జీవించాడు. ఇతని తాత్వికత చార్వాక, ఎపిక్యూరస్ తాత్వికతలకు దగ్గరగా వుంటుందని చాలా మంది అభిప్రాయం.

చార్వాకులు ఇహలోకాన్ని మాత్రమే ఆలోచనా విషయంగా గ్రహిస్తారు. మూల భౌతిక పదార్థాలైన భూమి, నీరు, అగ్ని, వాయువులను ఎవ్వరూ సృష్టించలేదు. వీటి వల్లే యీ జగత్తు ఏర్పడింది. ఇందుకు ఏ శక్తి కారణం కాదు. యీ మూల భౌతిక పదార్థాలే అనేక రూపాలుగా సంఘటించాయి. ఆకులు, వక్క, సున్నం కలిపి నమిలితే ఎరుపు రంగు వస్తుంది. ఆ రంగు యీ మూడు పదార్థాలలో విడి విడిగా దేంట్లోనూ లేదు. ఈ విధంగానే ప్రపంచ పరిణామం కూడా జరిగిందంటారు. చార్వాకులు ప్రత్యక్ష జ్ఞానాన్నే ప్రమాణంగా అంగీకరిస్తారు. భగవంతుడు ప్రత్యక్షం కాదు కాబట్టి వీళ్లు ఈశ్వర అస్తిత్వాన్ని అంగీకరించరు. శరీరమే ఆత్మ, చైతన్యం ఆత్మ యొక్క ధర్మం. శరీరం నశిస్తే ఆత్మకూడా నశిస్తుంది. మరణమే మోక్షం. ధర్మాధర్మాలు, పాపపుణ్యాలు, స్వర్గనరకాలనుఅంగీకరించరు. లౌకిక సుఖాన్నే పరమార్థంగా భావిస్తారు. ఆస్తికులు పరలోక సౌఖ్యాన్ని కాంక్షిస్తే, వీళ్ళు ఇహలోక సౌఖ్యాన్ని

కాంక్షిస్తారు. ఇక పోతే పాశ్చాత్య దార్శనిక జగత్తులో సుఖవాదాన్ని (Hedonism), డెమాక్రటస్ (Democratus), ఎపిక్యూరస్, (Epicurus)లు క్రేటియస్ (Lucretius) వంటి తాత్వికులు సుఖము లేక సంతోషమే మానవుడి అంతిమ లక్ష్యంగా ప్రచారం చేసారు. కాలక్రమంలో ఈ సుఖవాదన్నే ప్రామాణికంగా తీసుకొని హ్యూమ్ (Hume), జెర్మి బెంథామ్ (Jermy Bentham), జె. యస్. మిల్ (J.S.Mill) వంటి తాత్వికులు ఉపయోగితా వాదాన్ని (utilitarianism) ఏర్పాటు చేసారు. సుఖవాద లక్షణాలు పాజిటివిస్టుల్లోనూ (positivists) ప్రాగ్మటిస్టుల్లోనూ (pragmatists) వున్నాయని ఆధునికులు అంటారు. సుఖమే పరమార్థమని సుఖవాదులు నమ్ముతారు. ఈ జగత్తు సృష్టంతా యాదృచ్ఛికం అంటారు.

ఖయ్యామ్ తాత్వికతకు ఈ సిద్ధాంతాలను పోల్చినప్పుడు కొన్ని మౌలికమైన వ్యత్యాసాలు. సారూప్యాలు కనిపిస్తాయి. ఖయ్యామ్ విధిని, జ్యోతిష్యాన్ని సమర్థిస్తాడు. ఇవి ప్రత్యక్ష ప్రమాణాలు కావుకాబట్టి, చార్వాక, ఎపిక్యూరస్‌లు వీటిని వ్యతిరేకిస్తారు. పైగా ఇవి నిరీశ్వర వాద సిద్ధాంతాలు. ఖయ్యామ్ ప్రాథమికంగా ఈశ్వరవాది. ఇవి వ్యత్యాసాలైతే, ఆత్మకు అస్తిత్వం లేదని ముగ్గురూ అంగీకరిస్తారు. లౌకిక సుఖమే పరమార్థంగా ఖయ్యామ్ తాత్వికత కూడా కొనసాగుతుంది. ఇవి సారూప్యాలుగా చెప్పొచ్చు. భగవంతుడు వున్నాడని, ఆత్మ వుందని, ఆత్మ పరమాత్మ ( భగవంతుడు) లో ఐక్యం కావడమే మోక్షంగా నమ్ముతారు ఆస్తికులు. భగవంతుడు లేడని, ఆత్మ లేదని ( నశిస్తుంది) చెబుతారు నాస్తికులు. 'భగవంతుడు వున్నాడని, ఆత్మలేదని' ఒక ప్రత్యేక తాత్విక తరహాలో ఖయ్యామ్ తాత్వికత కొనసాగుతుంది. ఇంకా స్వర్గనరకాల గురించి కూడా ఖయ్యామ్ ఇలా వ్యాఖ్యానిస్తాడు. ''నీకు స్వర్గంపైన వాంఛ వుంటే / మఠాల వెంటా మసీదుల చుట్టూ తిరుగు / నాకు మాత్రం మధువు - ప్రియురాలు చాలు/నేను నరకానికి పోతానంటావా? పోనీ, చింతలేదు''[6] అంటాడు. ఆస్తికులకు మరణాంతర జీవితంపై ఆసక్తి ఎక్కువ. దానిపై వాళ్ళకు విపరీతమైన అపోహలు, ఊహలు వున్నాయి. స్వర్గానికి (మోక్షం) పోవడమే వాళ్ళ అంతిమ లక్ష్యం. శరీరం లేకుండా ఆత్మకు. అస్తిత్వం లేదుకాబట్టి, శరీర రహిత స్థితిలో స్వర్గమైన, నరకమైన ఒకటేనని ఖయ్యామ్ భావన. ఇహలోకంలో శరీరం సుఖాన్ని అనుభవించడమే నిజమైన స్వర్గమని ఖయ్యామ్ భావిస్తాడు.

ఉమర్ ఖయ్యామ్‌లో ఆనాటి సు ఫీమత ఈశ్వర సర్వజ్ఞతత్త్వ ప్రభావం స్పష్టంగా కనిపిస్తుంది. సూఫీభక్తులు, కవులు ద్రాక్షరసానికి అపారమైనగౌరవాన్ని కల్పించారు. సూఫీ అయిన ఉమర్ ఖయ్యామ్ అనుభవించిన భోగం కేవలం భక్తి పరవశం, తాగిన మధువు భగవత్పాదారవింద ధ్యానామృతమే... కామించిన మగువ పరాశక్తి సచ్చిదానంద స్వరూపమగు పరబ్రహ్మమేనని భావించారు. ఐహిక ప్రేమ దైవభక్తికి మార్గదర్శకమని సూఫీల అభిప్రాయం. స్త్రీ పురుషులు భేదం లేకుండా ప్రణయంలోకి దిగి శృంగార రసానుభూతిని పొందటం దైవానుభూతిని పొందటమేనని భావించారు.

సాధారణంగా దైవభక్తి మనస్సుకి సంబంధించిన అనుభూతి. కానీ, శారీరక అనుభూతిలోకి దైవత్వాన్ని ఆపాదించుకోవటం సూఫీల భిన్నతరహా భక్తితత్త్వం. 'అన్నం పరబ్రహ్మ స్వరూపం' అనే మాట ఈ తరహా భక్తికి సంబంధించిందే. అన్నం తిన్నప్పుడు శరీరం నిలువెల్లా ఆకలి తీరిన అనుభూతిని పొందుతుంది. పరబ్రహ్మ శరీరంలోకి ప్రవేశించినట్లుగా భావిస్తారు. ఇదే ఈశ్వర సర్వజ్ఞతత్త్వం. అదే విధంగా మధువుని తాగటం, మగువను అనుభవించటం కూడా దైవాన్ని తనలోకి ఆపాధించుకోవటమే అవుతుందని సూఫీలు నమ్ముతారు. ఈ తాత్వికతను భారతీయ తాత్వికుడు 'రజనీష్'లో కూడా చూడొచ్చు.

నాస్తికుల్లాగే ఖయ్యామ్ కూడా వర్తమానాన్నే ప్రమాణంగా స్వీకరిస్తాడు. ''ఇంకా పుట్టని రేపూ, పుట్టి చచ్చిన నిన్నా/ వాటిని తలచుకొని చిరాకు పడకు / ఈ రోజు హాయిగా తాగి అన్నీ మరచి పోదాము/ ఇప్పుడు అనే క్షణమే మిగిలింది మనకు''[7] అని అంటాడు ఖయ్యామ్. మనిషి ఎప్పుడు గతంలోనూ, భవిష్యత్‌లోనూ జీవిస్తూ వుంటాడు. వర్తమానాన్ని నిర్లక్ష్యం చేస్తాడు. అందుకే మనిషి జీవితం దుఃఖపూరితంగా వుంది. మనిషి ఎప్పుడైతే వర్తమానంలో జీవిస్తాడో అన్ని బంధాల నుండి, చికాకుల నుండి విముక్తుడవుతాడు. ఇటువంటి తాత్విక భావనను 'జిడ్డు కృష్ణమూర్తి'లో కూడా చూడొచ్చు.

జీవితం తాత్కాలికమైనది. నిన్నటిగురించి ఆలోచించడం సబబు కాదు. నేడే నిజం, రేపు అనేది సందేహాస్పదం, వృధాగా జీవితాన్ని దుఃఖానికి గురిచేయ కూడదు. మధువుని తాగాలి, మగువ పొందు కోరాలి. పరలోక సుఖాలను ఇక్కడే అనుభవించాలి. ఇదే ఉమర్ ఖయ్యామ్ రుబాయీల తాత్విక సారాంశం.

## REFERENCES :

1. కవికోకిల దువ్వూరి రామిరెడ్డి, పానశాల-కేతిరెడ్డి విద్యాపీఠం - మద్రాస్ - 18, 1991, పద్యం సంఖ్య - 52. 2. గుడిపాటి వెంకటా'చలం', ఉమర్ ఖయ్యామ్ రుబాయీలు, - అరుణా పబ్లిషింగ్ హౌస్, విజయవాడ - 2, 1996, పేజి - 48. 3. Ibid., Page - 9. 4. Ibid., Page - 50. 5. Ibid., Page - 45. 6. Ibid., Page - 49. 7. Ibid., Page - 22.

## Other Sources for Further Study

1. The Rubaiyat of Omar Khayyam - Edward Fitzgerald. 2. In Search of Omar Khayyam - Ali Dashti. 3. పానశాల - కవికోకిల దువ్వూరి రామిరెడ్డి 4. మధుకలశం - రాయప్రోలు సుబ్బారావు. 5. ఉమర్ ఖయ్యామ్ - రుబాయీలు - చలం 6. ఉమర్ ఖయ్యామ్ - డా॥ శ్రీ ఉమర్ అలీషా. 7. డా॥ ఉమర్ అలీషాగారి ఉమర్ ఖయ్యామ్ రుబాయీలు అనుశీలన - షేక్ ముహమ్మద్ ముస్తఫా. 8. సారస్వత వ్యాస ముక్తావళి - డా॥ బూర్గుల రామకృష్ణరావు. 9. ఉమర్ ఖయ్యామ్ - లత.

# అంతర్జాతీయ భాష

- వాడపల్లి లక్ష్మీనారాయణాచార్యులు

మన పురాణాల్లో వసిష్ఠుని హోమధేనువు శరీరం నుండి పుట్టిన - శబర, శక, యవన, పౌండ్ర, ద్రవిళ, సింహళ, పుళింద, దరద, బర్బరాది వివిధ జాతులవారు - తమలో తాము ఒక మాటకు కట్టుబడి తల్లి మాటను తామంతా అర్థం చేసుకొని అధర్మంపై కత్తి బూని విశ్వామిత్రసైన్యాల్ని రూపు మాపి ధర్మ సంస్థాపన చేసినట్లుగా వొక కథ వుంది.

విదేశీ పురాణాల్లో - 'ఆదమ్' సృష్టిని ఆరంభించినప్పటి నుండి 'నిమ్రాడ్' స్వర్గ ప్రస్థానానికి స్తంభ నిర్మాణాన్ని చేపట్టేంత వరకూ వొకే భూమిపై వున్న మానవులంతా ఒకే భాషను వాడుకొంటూ, ఒకే మాటగా ఉంటూ చిట్ట చివరికి బొందితో స్వర్గానికి వెళ్ళగలమనే ఆలోచనాత్మక మహోన్నత ప్రగతి సాధించేరనీ; కాని ఆ పనికి అలిగిన భగవానుడు ''ఈ స్తంభ నిర్మాణంలో చేతులు కలిపిన వాళ్ళంతా తలోభాషె మాట్లాడుకొనుగాక!'' అని శపించేడని; దానితో వొకడి గోల మరొకడికి తెలియక ఏపనీకాక చివరికి ఆ స్తంభమే నేలపాలు చేసుకొన్నారనీ తెల్పే వొక కథవుంది. ("Tower of Babble" - Genesses - XI )

పైవి రెండూ పుక్కిటి పురాణాలే కావచ్చు. కాని; భాషాభేదాలు అడ్డురాకపోతే ఎంతటి అభ్యున్నతినైనా మానవాళి కలసికట్టుగా సాధించి తీరుతుందనే సత్యాన్ని మాత్రం అంతర్గతంగా చాటుతున్నాయని గుర్తించాలి. ఇలా ఈ సత్యాన్ని గుర్తించిన మానవుడు అలా కథల్ని అల్లుకుంటూ పదహారో శతాబ్దం దాకా అంతర్జాతీయ భాషా సాధన తన తలకు మించిన పనిగానే ఎంచుతూ వచ్చేడు. కాని, తర్వాత మాత్రం ఎలాగైనా దాన్ని సాధించి తీరాలని తహతహలాడేడు.

18వ శతాబ్దం నుంచి క్షణక్షణానికీ ఎన్నెన్నో రంగాల్లోనో ముందడుగు వేసుకు వస్తున్న మానవాళికి ఈ భాషా విభిన్నత్వం వొక భరింపరాని సమస్యగా యెదురై సత్వర సమస్యా పరిష్కారానికై మేధావులు నడుం బిగించేటట్లు చేసింది. అప్పటి నుంచి ఇప్పటిదాకా ఈ 'అంతర్జాతీయ భాష' సృష్టించడానికి జరిగిన మేధావుల అసాధారణ కృషి నంతటినీ (1) మృత భాషా వాదం (2) స్వచ్ఛంద సంక్షిప్త భాషా వాదాం (3) వ్యవహారస్థ భాషా వాదం (4) కల్పిత భాషా వాదం అని నాలుగు విధాలుగు విభజించుకొని అర్థం చేసుకొందాం!

కట్టుదిట్టంగా వ్యాకరణాదులూ పకడ్బందీగా సాహితీ ప్రక్రియలూ గల ప్రాచీన భాషనే గాని 'విదేశీ వ్యవహార సహాయక భాష'( లింగ్వాఫ్రేంకా)గా వుంచితే ఎంతో సబబుగా వుంటుందన్న తలంపు కొందరికి కలిగింది. ఫలితంగా మధ్యయుగంలో అన్ని పాశ్చాత్య దేశాలలోనూ లాటిన్ భాషను 'లింగ్వాఫ్రేంకా'గా ఆదరించి; పసిపిల్లాడీ ద్వితీయ భాషగా దానిని నేర్చుకొని తీరేలా ఆంక్షల్ని ఆయాదేశపు ప్రభుత్వాలు విధించేయి.

మధ్యయుగానికి ఎంతో ముందే లాటిన్ 'మృతభాష'గా మారిపోయింది. హైగా సిసిరో కాలంనాటి లాటిన్‌కీ ఈ మధ్యయుగంలో ఆదరింపబడే లాటిన్‌కీ విపరీతమైన తేడా వుండేది.

---

భాషాప్రవీణ శ్రీ వాడపల్లి లక్ష్మీనారాయణాచార్యులు, విజయనగరం.

సరిగ్గా ఇలాంటి ప్రతిపత్తినే మన దేశంలో సంస్కృతానికి ఒకనాడు ఇచ్చేరు. లాటిన్ లాగ ఇది కూడా 'మృతభాషే'! ఇటు దక్షిణాపథం అంతా మూలద్రావిడ భవాలైన భాషలను మట్లాడే ప్రజలే వున్నా; అటు ఆర్యావర్తమంతా సంస్కృత భవ ప్రాకృత భవ భాషావ్యవహర్తలే ఉన్నా సంస్కృతాన్ని మాత్రం దేశమంతటా ద్వితీయ భాషగా అభ్యసిస్తూ రాజభాషగా దాన్ని ఆదరించేవారు. ఈ సంస్కృతానికీ వేదకాలం నాటి సంస్కృతానికీ చాలా తేడా వుంది. అయితే, ఈ సంస్కృతం సంగతి కొన్ని రాష్ట్రాలకూ వొక దేశానికీ సంబంధించినదనీ లాటిన్ సంగతి కొన్ని దేశాలకూ ఖండాలకూ చెందిందని గుర్తించాలి.

రోమన్ దేశీయుల నాలుకలలో నలిగిన లాటిన్ మూలాన్నే మరిపించేటంతగా మారడాన్ని భరించలేని సాంప్రదాయిక వర్గం ఆ లాటిన్‌ను నేర్చే మాట్లాడే హక్కుల్ని మునపటిలా అందరికీ కాక మతాచార్య న్యాయవాదులకూ, కొంతమంది మేధావులకు మాత్రమే పరిమితం చేస్తూ ఆంక్షలు విధించింది.

దీనివల్ల విసిగిన మేధావులు ఇలాంటి 'మృతభాష'లను గాక; వ్యవహారంలో వున్న వొక భాషనే 'లింగ్వా ఫ్రేంకా'గా ఎన్నుకొంటే ఉభయ తారకంగా ఉంటుందనుకొన్నారు. ఇలా వాళ్ళనుకోడమే తడవుగా ఆనాడు రాజకీయంగా వైజ్ఞానికంగా మంచి ప్రచారంలో ఉన్న ఫ్రెంచి భాష కొన్నేళ్ళ బాటు ఆభాగ్యానికి నోచుకొంది. కాని; స్వల్ప వ్యవధిలోనే ఆంగ్లేయుల రాజకీయ ప్రాబల్యంవల్లా వాణిజ్య పారిశ్రామిక వైజ్ఞానిక రంగాల్లో వారి ప్రగతి వల్లా ప్రపంచ బహుళ వ్యాప్తివల్లా ఆంగ్ల భాష ఆ భాగ్యాన్ని చేజిక్కించుకొంది.

ఫ్రెంచి, ఆంగ్ల భాషాభ్యాసన లేఖనాల్లో ఓం ప్రథమంగా ఎదురయే ఉచ్చారణ, స్పెల్లింగ్‌ల గాభరాలవల్లా ఏ అన్యదేశీయ పదజాలాన్నికైనా ఈ భాషాద్వారాలు బార్లా తెరుచుకొని వుండడం వల్లా వీటిలో దేన్నీ 'లింగ్వాఫ్రేంకా'గా ఆదరించ లేక పోయేరు.

ఫలితంగా తిరిగి విపరీత కృషి 'అంతర్జాతీయ భాష' సాధనకై జరిగింది. వ్యవహారంలో నున్న భాషలన్నిటిలోంచీ ఒక క్రొత్త భాషను సృష్టించుకొంటేనే ఈ సమస్య సంపూర్ణంగా పరిష్కృత మౌతుందని తెలుసుకొన్న మేధావులు తమతమ ఆలోచనలను అనుసరించి కొత్త భాషలను సృజించడం మొదలు పెట్టేరు. ఫలితంగా నూటికి పైగా అంటే సాలుకోభాషచొప్పున 'కల్పిత భాష'లు పుట్టుకొచ్చేయి. వీటికి ఉదాహరణలుగా Kosmos; Occi Dental; Parla; Spokil; Modern Hebrew, Universila; Frater లాంటి పేర్లతో పుట్టుకొచ్చిన భాషల్ని చెప్పుకొంటూ పోవచ్చు దేనివల్లా ఫలితం నెరవేరలేదు.

1879లో సమగ్ర ప్రణాళికతో జర్మనీ మతాచార్యుడైన ఫాదర్ జోహన్ మార్టిన్ ష్లెయర్ తన జర్మనీ పదాలకు ఆంగ్ల ఫ్రెంచి భాషల లోంచి ఇంకా ఇతర ఐరోపీయ భాషలలోంచీ మూలరూపాల్ని సేకరించి 'వొలపక్' అనే 'కృతక భాష'ను సృష్టించేడు. అసలీ భాష పేరే 'వరల్డ్ స్పీచ్' అనే ఆంగ్ల పదబంధ ప్రత్యామ్నాయ పదం !

ఈ 'వొలపక్' మంచి ఆదరణ పొంది, ఆనాటి యువతరానికి నిత్యవ్యవహారంలో ఫ్యాషన్‌గా రూపొందింది. పుట్టిన పదేళ్ళ నాటికే అంటే 1889 నాటికి ఈ భాషా వ్యవహర్తల సంఖ్య 10 మిలియన్లకు మించి పోయింది!

కాని; ఈ భాష ఏ సూత్రానికీ కట్టుబడి ఉండనందువల్లా కృతకత్వం అన్ని విషయాల్లోనూ ఎబ్బెట్టుగా కనిపిస్తుండడంవల్లా ముఖ్యంగా నేర్చుకోడం కష్టతరం అవడం వల్లా ఈ భాషా వ్యవహర్తల సంఖ్య క్రమక్రమంగా క్షీణించింది.

1880లోనే ఈ 'వొలపక్' లోటుపాట్లని ఆకళించుకొన్న డా॥ లాజరస్ లుడ్విన్ జామెన్హోఫ్ అనే రష్యన్ యూదు యువకుడు రోమన్ భాషాకుటుంబ భాషలలోంచి మూల రూపాల్ని ఎంపిక చేసి ఎస్పరేంటో' అనే 'కృతక భాషా' పరికల్పన చేసేడు.

వొలపక్ కన్నా ఒక నియమానికి కట్టుబడి వుండడం వల్లా శ్రావ్యంగా ఉంటూ నేర్చుకోవడం సులువవడం వల్లా ఈ 'ఎస్పరేంటో' రెండవ ప్రపంచ యుద్ధ సమయందాకా లక్షలాది జనుల ఆమోదాదరణలను పొంది సత్ఫలితాలను సాధించింది. రోమన్, లాటిన్ భాషలలోంచి ఎక్కువగానూ జర్మన్, గ్రీస్‌లలోంచి తక్కువగానూ మిగతా ప్రపంచ భాషలలోంచి పరిమితంగానూ పదజాలాన్ని కూడదీసుకొని ఈ 'ఎస్పరేంటో' రూపుదాల్చింది. పదాల మొత్తం చాలా తక్కువే అయినా ప్రతీ పదానికీ ఎన్నెన్నో నానార్థాలుంటాయి. వ్యాకరణం నామమాత్రం! ఈ భాషలోని నామ వాచకాలన్నీ - "O' తోనూ; విశేషణాలన్నీ - "a' తోనూ అంతమౌతాయి.

ఆనాటి నానాజాతి సమితి ఒక పత్రం ద్వారా ఈ 'ఎస్పరేంటో'కి గుర్తింపు కలుగజేసి; ప్రపంచ దేశాలన్నీ దీన్ని ద్వితీయ భాషా ప్రతిపత్తితో 'అంతర్జాతీయ భాష'గా పరిగణించాలని సిఫార్సు చేసింది. అంతర్జాతీయ సంఘాలన్నీ తమ తమ సమావేశాలలో ఈ ఎస్పరేంటో భాషని 'అనుబంధ భాష'గా వాడేవి. వివిధ దేశ ప్రతినిధులతో కూడిన 'యూనివర్సల్ ఎస్పరేంటో అసోసియేషన్' అనే సంస్థ కూడా ఏర్పడడంతో ఈ భాషా ప్రగతి రెట్టింపైంది.

కాని; రెండవ ప్రపంచ యుద్ధ సమయాన తలెత్తిన దేశీయ దురభిమానాలకు ఈ ఎస్పరేంటో ఎర అయింది. ఈ భాష కేవలం పశ్చిమ ఐరోపీయన్ల కోసమే వాళ్ళ చేతే నిర్మింపబడిందని నిందలు మోపేరు. అందుకు ఉదాహరణలుగా ఈ ఎస్పరేంటోలోని భాషా భాగాలన్నీ ఇండో-యూరోపియన్ భాషా సంబంధాన్నే చెప్పక చెపుతున్నాయని భావించేరు.

ఈ సందర్భంలో మన తెలుగు వాళ్ళను కూడా దృష్టిలో పెట్టుకొని ఈ భాషను నేర్చుకోడంలో ఎదురయ్యే లోతుపాతులను ఎత్తిచూపిన రాబర్ట్ హాల్ అభిప్రాయాన్ని యధాతథంగా ఉట్టంకిస్తున్నాను: "All most all the artificial 'International Languages' that have been constructed so far have been essentially designed for and by Western Europeans --- A spcacker of, say Chinise or TELUGU or some American Indian language world have as much difficulty with ESPERANTO as he would with French or English or Germany".

అయితే, మూడు వేలకి పైబడి వున్న ప్రపంచ భాషలలోంచి ఇంతకుమించిన సౌలభ్యంతో, అందరికీ అందుబాటుగా, సంతృప్తికరంగా ఒక 'కల్పిత భాష'ని నిర్మించడమంటే ఏం మాటలతో పని కాదు! ఎంత చేసినా యేదో వొక లోటు కనిపిస్తూనే వుంటుందని కూడా కొందరన్నారు.

ఈ ఎస్పరేంటోని వాడుతున్న తరాలు అప్పుడే మూడు నాలుగు గడిచిపోయేయి. మార్పు వ్యవహార భాషా లక్షణం గాబట్టి, ఈ మూడు నాలుగు తరాల నాటికే ఈ భాషలో ముఖ్యంగా ఊనిక - స్వరాల విషయంలో విపరీతమైన మార్పు వచ్చేసింది. నైసర్గికంగా పుట్టి పెరిగిన, మార్పులు పొందివస్తున్న భాషకి సమగ్ర నిఘంటు వ్యాకరణాదులూ, సమగ్ర సాహిత్యమూ వుంటాయి గాబట్టి, అయిష్టమైన మార్పులని సరిజేసుకో వీలౌతుంది. కాని; ఇలాంటి వ్యాకరణాదులు లేని 'కల్పిత భాష'లను భావి తరాల వాళ్ళు ఎలా సరిదిద్దుకోడం! - అని మరికొందరు నోళ్ళు నొక్కుకున్నారు.

ఏదేమైనా ఈ 'ఎస్పరేంటో' కేవలం జాతీయ దురభిమానాలకు బలై కేవలం అభిమానుల నోళ్ళలోనే ఈనాడు కావుంటూ పూర్వ ప్రాభవాన్ని కోల్పోయింది. ఈ ఎస్పరేంటోలో అందరూ వేలెత్తి చూపిన లోటుపాట్లను సవరించి, దాని సంశోధిత రూపాలుగా మేధావులు తయారు చేసిన - 'ఇడో', 'లాటిన్ - ఎస్పరేంటో' (ఈ రెండూ రోమన్ భాషా కుటుంబానికి 'పిడ్జిన్ భాషలు'.), 'ఎస్పరేంటో-II', 'నోవియల్' అనే భాషలు కూడా పూర్వ ప్రాభవాన్ని పునఃకల్పింపలేకపోయేయి.

పై కారణాల వల్ల మేధావుల దృష్టి మరోవైపు మళ్ళింది. ఇలా 'కల్పిత భాష'ని నిర్మించకుండా వొక సమగ్ర భాషనే తీసుకొని, అందలి లోటు పాట్లను త్రోసి రాజని 'స్వచ్ఛంద సంక్షిప్త కల్పిత భాష'గా తయారు చేస్తే మెరుగుగా వుంటుందని కొందరు తలంచేరు. ఫలితంగా 'మృతభాష' అయిన లాటిన్‌ను తిరిగి తీసుకొని 1910 ప్రాంతంలో 'Latino Sine Flexione' అనే పేర ధాతు వికారాలు లేకుండా ఒక 'స్వచ్ఛంద సంక్షిప్త మృత భాష'ని ఇటలీ గణిత శాస్త్రవేత్త అయిన Giuseppe Peano సృష్టించేరు. కాని; 'మృతభాష'కు కల్పిత భాష అయిన ఈ భాష కూడా తగిన గుర్తింపు నోచుకోలేదు.

ఇలా 'మృతభాష'ను గాక ప్రస్తుతం చెలామణీలో ఉన్న భాషనే ఆ రకంగా సవరించీ కుదించీ పని చక్కబెట్టుకోవాలని మరికొందరు కృషి చేసేరు. ఫలితంగా 1920లో ఛార్లెస్ కే ఆగ్డేన్, ఐ.ఎ. రిఛర్డ్సులు కలసి నేటి ఆంగ్ల భాషకు 'బేసిక్ ఇంగ్లీషు' అనే 'స్వచ్ఛంద సంక్షిప్త కల్పిత భాష'ను సృష్టించేరు. ఏభైవేల పై చిలుకు ఆంగ్ల పదాల్నీ 'ప్రామాణికాంగ్లా'న్ని నమూనాగా ఎంచుకొని 850 పదాలకే పరిమితం చేసేరు. ఈ 850లోనే 'ఆపరేటర్స్' అనబడే సహాయక క్రియలు - 'get-do-be' లాంటివి 18 మాత్రమే వుంటాయి. ఈ మూడూ ఇతర దేశీయుల్ని ఎంతగా అల్లరి పెడతాయో అందరికీ తెలుసు. క్రియలు, అవ్యయాలు, సర్వనామాలు, ఆర్టికల్స్ మున్నగు వాటికి కేవలం నూరు పదాలే కేటాయించేరు. ఉచ్చారణ - స్పెలింగ్‌లను తొలగించేరు. నిఘంటువులలోని పదాలను ఎంపిక చేయడంలో సూటిగా అర్థాన్ని చెప్పేవాటికే చోటిచ్చి, అర్థ వ్యాకోచ, నానార్థ, పర్యాయ పదాల్నీ; డొంక తిరుగుడు అర్థాలు చెప్పే పదాల్నీ ఏరివేసేరు.

ఒక దశాబ్దం పైగా ఈ 'బేసిక్ ఇంగ్లీషు' మంచి ప్రచారాన్నే పొందింది. కాని, పరిమిత పదజాలమే గల ఈ భాషలో భావ వ్యక్తీకరణకి ఒక్కోసారి గొలుసుకట్టు పదాలను చెప్పవలసి రావడం వల్లా ప్రపంచ వ్యాప్తంగా ఆదరింపబడే ఆధునిక భాషా శాస్త్ర సూత్రాలను ఈ భాష ఆదరింపక పోవడం వల్లా ఇది కూడా మరుగున పడింది.

దీనితో ఇక ఈ ''స్వచ్ఛంద సంక్షిప్త భాష'లకు స్వస్తి చెప్పి; తిరిగి 'కల్పిత భాషల' వైపు దృష్టి మళ్ళించేరు. అలా మళ్ళించడమే కాదు మారడం కూడా జరిగిందనవచ్చు. ప్రపంచ భాషా సర్వస్వానికీ ప్రత్యామ్నాయంగా ఒకే ఒక భాష నిర్మించడం ఇప్పటిలో సాధ్యం కాదు గాబట్టి ''అంతర్జాతీయ సహాయక భాషా'' నిర్మాణాన్ని ముందుగా చేబట్టాలని మేధావులు తలపెట్టేరనవచ్చు!

'IALA' (International Auxiliary Language Association) అనే సంస్థ పై భాషల నన్నిటినీ జాగ్రత్తగా పరిశీలించింది. ఆధునిక భాషా శాస్త్రాన్ని వినియోగించుకొంటూ ప్రపంచ భాషా సర్వస్వానికీ ఒకే భాష నిర్మించ వచ్చునని నమ్మి పాతికేళ్ళకు పైగా నిరంతర కృషి చేసింది. తత్ఫలితంగా 1924లో 'మోడర్న్ ఇంటర్‌లింగ్వా' అవతరించింది. తొలి దశలో IALA ముఖ్య సభ్యుడైన B.C. Whoy ఈ భాషను 'స్టాండర్డ్ ఏవరేజ్ యూరోపియన్' అనే పిలచినా తరవాత 'మాడర్న్ ఇంటర్ లింగ్వా' అనే పేరే స్థిరపడింది.

దీని అవతరణతో అందరి ఆశయాలూ అవసరాలూ గట్టెక్కేయి. IALA సభ్యులు ప్రపంచ వ్యాప్తంగా గోచరించే భావనా ధోరణుల్నీ భాషా పద్ధతుల్నీ సంపూర్ణంగా ఆకళించుకొని, మారుమూల భాషలలోని ధాతు రూపాలను కూడా అవసరమొస్తే స్వీకరిస్తూ ఈ 'కల్పిత భాష'ని సృజించేరు. పాత భాషల లాగా ఇదే విషయంలోనూ దబాయింపును చూపక ఆధునిక భాషా శాస్త్ర సూత్రాలకు తలవంచి వుంటుంది.

లాటిన్, గ్రీస్, ఫ్రెంచిలలోంచి భాషా పదాల్ని ఎంచేరు. ఈ ఎంపికలో విజ్ఞాన శాస్త్ర సాంకేతిక శాస్త్రాలతో బాటు నిత్య వ్యవహారంలోని సామాన్య పదాల్ని కూడా దృష్టిలో ఉంచుకొన్నారు. మచ్చుకి ఫ్రెంచి పదాలైన 'టెలిగ్రాఫె', ఇండైరెక్ట్, డిస్టిలేషన్, కంపేరిజన్, డిఫికల్ట్, ఫంక్షన్, గైడ్ సిస్టమె లాంటివి స్వల్ప భేదాలతో స్పానిష్, ఇటలీ, పోర్చుగీసు, ఇంగ్లీషులలో వున్నాయి గాబట్టి అలాంటి వాటిని అలానే గ్రహించేరు.

ఈ 'మాడర్న్ ఇంటర్ లింగ్వా' పైపైకి గ్రీక్, లాటిన్, రోమన్ భాషా కుటుంబాలలోంచి ఏర్చి కూర్చిన పదాల మొత్తంగా, ఆ కుటుంబాలపై ఆధారపడిన కల్పిత 'పిడ్గిన్' భాషగానే కనిపించినా సూక్ష్మ దృష్టికి లాటిన్ భాషా ప్రత్యక్ష తద్భవాలైన రోమన్ భాషా కుటుంబం పై ఎక్కువ మొగ్గు చూపిందని తెలుస్తుంది.

పై ఏరోమన్ భాషా కుటుంబ భాషకూ లేనంత అతి స్వల్ప వ్యాకరణాన్ని ఈ భాషకు రచించేరు. లింగాన్ని బట్టి నామవాచక విశేషణాలు గాని ఆర్టికల్స్ గాని ఈ భాషలో మారవు. కేవలం 'హి-షి-ఇట్'లకే లింగాలుంటాయి. నామ వాచక విశేషణాలూ అజంతాలైతే అంతంలో 'S'

నీ హలంతాలైతే 'es' నీ, బహువచనంలో పొందుతాయి. క్రియా రూప నిష్పత్తిని సంపూర్ణంగా నేలమట్టం చేసి మరీ వదిలేరు!

1951నాటికి ఈ 'మాడర్న్ ఇంటర్ లింగ్వా'కి మరింత సమగ్ర వికాసాన్నిచ్చి 'ఇంటర్ లింగ్వా - ఇంగ్లీషు నిఘంటువు' నీ; 'ఎస్ ఇంటర్ లింగ్వా గ్రామర్'లను ప్రచురించేరు. 1953 నాటికి డా॥ అలెగ్జాండర్ గోడ్ యొక్క అపార కృషి పర్యవేక్షణల ఫలితంగా దీనికి విజ్ఞాన శాస్త్ర విభాగంగా 'ఎస్ ఇంటర్ లింగ్వా సైన్స్ సర్వీస్ డివిజన్' ఏర్పడింది. ఈ భాషకు లేఖనా భాషగా చక్కని గుర్తింపు వచ్చింది. ఈనాటి సాంకేతిక శాస్త్ర, విజ్ఞాన శాస్త్ర రంగాల్లో వెలువడే గ్రంథాలన్నింటా కేవలం ఈ భాషే స్వీకరింపబడుతోంది. సైన్సు సర్వీసు ఆధ్వర్యంలో మొదట్లో మాస పత్రిక గానే వచ్చిన ''సైన్స్ ఇంటర్నేషనల్'' అనేది ఈనాడు 'సైన్స్ న్యూస్ లెటర్' అనే వార పత్రికగా ఈ భాషలోనే ప్రచురితమౌతోంది. ఇలాగే ''ఇల్లీనోయిస్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ'' అనే సంస్థ ఏర్పడి 'స్పెక్ట్రోస్కోపియా మోలిక్యురల్' అనే పీరియాడికల్‌ని వెలువరిస్తోంది. 25 పై బడిన వైద్య శాస్త్ర పత్రికలలో ఈ భాష అదనపు భాషగా స్వీకృతమైంది. ఇంకా కొన్ని పత్రికలు ఆయా వ్యాస సారాంశాలను ఈ భాషలో ప్రచురిస్తున్నాయి. అంతర్జాతీయ విజ్ఞాన శాస్త్ర సమ్మేళనాలు విడుదల చేసే విషయ సంగ్రహ సూచికలలో ఈ భాషే సహాయక భాషా ప్రతిపత్తినందింది.

ఇలా ఇది 'సహాయక భాషా' ప్రతిపత్తిని ఎన్ని రంగాలలో సాధించినా IALA సంఘం ఈ భాషను 'అంతర్జాతీయ భాష'గా రూపొందించారే తప్ప 'అంతర్జాతీయ సహాయక భాష'గా కాదని గుర్తుంచుకోవాలి.

ప్రస్తుతం ప్రపంచంలో అధిక ప్రచారంలో వున్న 'ఇంటర్ లింగ్వా' ఈ 'మాడర్న్ ఇంటర్ లింగ్వా'యే. దీని కన్నా తక్కువ స్థాయిలో 'ఎస్పరేంటో - II', 'బేసిక్ ఇంగ్లీషు'లు మాత్రమే ఆదరింపబడుతున్నాయి. 'మాడర్న్ ఇంటర్ లింగ్వా' సర్వే, సంబంధిత గ్రంథాలమ్మే సంఘాలు కలకత్తా వంటి మహా నగరాలలో మనదేశంలో ఉన్నాయి.

ఇక ఇలాంటి భాష అవసరాన్నీ మన కర్తవ్యాన్నీ చర్చిద్దాం.

ప్రపంచంలో ఏ మారుమూలనున్న ఏ మేధావి ఏ క్షణంలో ఏ రకమైన శాస్త్ర ప్రగతి సాధించినా ఆ కనుగొన్న మరు క్షణాన ప్రపంచం నలుమూలలా ఆ శాస్త్ర రహస్యం వెల్లడై ప్రతి మనిషీ ఆ ప్రగతి ఫలితాలైన సుఖ శాంతుల్ని అనుభవించాలంటే ఈ 'ఇంటర్ లింగ్వా' వుండి తీరాలి. కేవలం భాషావరోధం వల్ల మానవ పురోగతి కుంటు పడడాన్ని ఈనాడెవరూ సహించలేరు. అంతర్జాతీయ రాజకీయ సమావేశాలలో ఏ మారుమూల నుంచి వచ్చిన ఏ ప్రతినిధైనా తనగోడు మొరపెట్టుకోవాలన్నా తనను నమ్మి పంపిన దేశానికి ఏ ప్రయోజనాన్ని సాధించి పెట్టాలన్నా తన నోటిమాట యెదుటి వందలాది ప్రతినిధులకి సుస్పష్టంగా అర్థమై తీరాలి. భాష అనే అడ్డువల్ల ప్రపంచ శాంతి కాముకుల నోళ్ళు మూత పడడాన్ని ఎలా సహించగలం! విదేశీ వర్తకం సాఫీగా సాగాలన్నా విదేశీయాత్రికుల సరదాలు తీరాలన్నా 'ఇంటర్ లింగ్వా' మానవాళి నాలుకలపై నర్తించి తీరాలి.

80 భాషల్ని అనర్గళంగా మాట్లాడగల చర్చి అధికారి కార్డినల్ యుజ ఫాంటే లాంటి వాళ్ళూ అర్వై పై బడిన విదేశాలలో ఆ దేశీయులలాగే ఆయా భాషలలో మాట్లాడగల అలనాటి గ్రీకు నావికుని లాంటివాళ్ళూ ఏ భాషనైనా విన్నంతనే ఇట్టే పట్టేసే పండితరాయలు, నారాయభట్టు లాంటి వాళ్ళూ కొన్ని శతాబ్దాలకోసారి అవతరించే వింత మనీషులు. అది అందరికీ సాధ్యం కాదు. అలా కాని కారణంగా సామాన్య మానవులను కూపస్థ మండూకాలుగా వుంచడం ధర్మం కాదు. ఇంటర్ లింగ్వా వల్ల అట్టడుగు మనిషి నుండి అత్యున్నత మేధావి దాకా వైజ్ఞానిక రాజకీయ మానసిక ప్రగతుల్ని సాధించే వీలెంతైనా వుంది.

'అంతర్జాతీయ భాషో'దయం అయినా అవడంతో మన మృధు మధుర మాతృభాషా సంస్కృతులన్నీ కాల గర్భంలో కలసి పోతాయని తప్పుగా తలంచకూడదు. ఎవరి మాతృభాష వారికే వుంటుంది. జాతీయ భాషల బెడద వుండదు. 'అంతర్జాతీయ భాష'నే ద్వితీయ భాషగా నేర్చుకొంటారు.

మరో సంగతి! - ఈనాడు మన రాష్ట్ర సరిహద్దులలో వున్న ఒక విద్యార్థినే తీసుకొందాం. అతడు మొదటగా తన మాతృభాషనీ, వెంటనే తన ప్రాంతీయ భాషనీ, ఆ వెన్వెంటనే జాతీయ భాషలైన హిందీ, ఆంగ్లాలనీ, ఆ తరువాత మన ప్రాచీన సంస్కృతికి పట్టుగొమ్మ అయిన సంస్కృతాన్నీ ఇలా తప్పనిసరిగా అయిదు భాషల్ని నేర్వాలి. ఉద్యోగ రీత్యా ఏ ఇతర రాష్ట్రానికి వెళ్ళినా ఆ రాష్ట్ర భాషాభ్యాసం అనివార్యం. ఇక తన విజ్ఞాన తృష్ణ తీర్చుకోడానికి మరెన్ని భాషలను నేర్వాలో వాడికే తెలియాలి!

లారెంగో స్కోప్, కైమోగ్రాఫ్, ఫోనోగ్రాఫ్ - డిస్క్, లింగ్వాఫోన్‌ల వంటి అత్యాధునిక పరికరాలను వినియోగించుకొని ఏ ప్రపంచ భాషనైనా కేవలం 56 గంటల వ్యవధిలో ఆధునిక భాషా శాస్త్ర పుణ్యమా అని నేర్చుకోవచ్చు! కాని ఇది నేర్చుకోడమే గాని అవగాహన చేసుకోడం గాని సొంతం చేసుకోడం గాని కాదని గుర్తించాలి. దానికి అనర్గళ కృషి కావాలి. ఇలా కేవల భాషావగాహనాధ్యయనాలకే యువకుల జీవితాలంకితమై పోతే వారిలోని నిద్రాణిత శక్తుల్ని లోకానికి చాటేదెప్పుడు? అంచేత కేవలం రెండే భాషలను నేర్చుకొని ప్రపంచంలోని ఏమూలైనా బ్రతక గలగాలి.

పై విధంగా బహుళార్థ సాధకంగా అంతర్జాతీయ సోదర భావ సాధనే ప్రధాన ధ్యేయంగా సాగిన ఆ మేధావుల విశ్వతోముఖ దృష్టిని సరిగా ఆకళించుకొని ఏ మాత్రం వీలున్నా మనం కూడా ఉడతాభక్తిగా ఆ అంతర్జాతీయ భాషా సత్వర సాధన వ్యాప్తులకు తోడు పడాలి. అంతేగాని, ''ఈ ప్రపంచ భాషలలోంచీ వొక కల్పిత భాషను నిర్మించడం అనే దానికన్నా మరో నిరర్థక, ఉపద్రవకర కార్యం లేదు!'' అని నీళ్ళు కార్పించడం గాని, ''ఇలాంటివో భాష తయారవడం అందరికీ అభిలషనీయమే ఆదరణీయమే! కాని యెటొచ్చీ ఆచరణలోనే చుక్కెదురౌతోంది'' అని నీళ్ళు నమలడం గానీ, ''ఇక కొద్ది వ్యవధిలో వసుధైక ప్రభుత సాధింపబడి తీరుతుంది! కాబట్టి; ఆనాడే ఆ వసుధైక సామ్రాట్టే ఈ సంగతి సెకన్లలో తేలుస్తాడు!'' (Einar Hangen) అని డొంక తిరుగుడుగా మాటలాడ్డం ప్రచారం చేయడం విజ్ఞులకు భావ్యం కాదు.

ఈ 'అంతర్జాతీయ భాష'ని మరింత సమగ్ర రూపంతో రూపొందించి తీరాలనే ఆ మేధావుల దృష్టిలో వొకే భాష వున్న ఫ్రాన్సు, ఇటలీ, జర్మనీ, ఇంగ్లండు, రష్యా వంటి దేశాలకన్నా వందలాది భాషలూ, ఇరవై మూడు అధికార భాషలూ, రెండు మూడు రాజభాషలూ వున్న ఇండియా లాంటి వందలాది దేశాలే - గూడు కట్టుకొని వాళ్ళ బుర్రల్ని దొలిచేస్తున్నాయని తెలుసుకోవాల్సిన అవసరం ఎంతైనా వుంది.

అలా తెలుసుకోడంతో సరిపోదు. మనమంతా అనవరతం

''అయమాత్మః పరోవేతి గణనా లఘు చేతసాం!
పుంసాం ఉదారచిత్తానాం వసుధైక కుటుంబకమ్'' ॥

- అనే శ్లోకార్థాన్ని మననం చేసుకొంటూ ఆ మేధావుల కృషికి దోహదపడాలి.

**పరిభాష:**

విదేశీయ వ్యవహార సహాయక భాష : Lingua Franca

అంతర్జాతీయ సహాయక భాష : International Auxiliary or Contact Language

అవసరం కోసం సంక్షిప్తం చేసిన ప్రాచీన భాష : Pidin Language

కల్పిత భాష : Artificial or Neutral Language

అంతర్జాతీయ భాష : International Language

అదనపు భాష : Additional Language

మృతభాష : Dead Language

స్వచ్ఛంద సంక్షిప్తత : Deliberate Reduction

క్రియారూప నిష్పత్తి : Conjugation

భాషారూపాలు : Speech Forms

భావనాధోరణులు: Types of Concept

డొంక తిరుగుడుగా చెప్పడం : Circumlocution

శబ్ద ధాతువు : Word Root

ధాతు వికారం : Inflection

ప్రత్యక్షతద్భవం : Direct Aescendant

**పరిశీలిత గ్రంథాలు**

1. 'Introductory Lingvistics' - Robert A. Hall (J.W.)

2. 'Linguistics' edited by Archibalda. Hill "National and International Languages" - Einar Haugen.

3. "Basis of Human Communication" - Popular Science - Vol - I

# యుద్ధం ఒక ఉన్మాదం - జె. కృష్ణమూర్తి

- సరోజిని ప్రేమ్ చంద్

''యుగయుగాలుగా మానవాళి కార్చిన దుఃఖాశ్రువుల నిరంతర స్రవంతులు మనిషి మనసులో నుండి 'చంపాలి' అనే కోర్కెను తుడిచి వేయలేక పోయాయి. ఏ ఒక్క మతమూ యుద్ధం కూడదని ఆపలేక పోయింది. పైగా అన్ని మతాలూ ఏదో ఒక రకమైన యుద్ధాన్ని ప్రోత్సహిస్తున్నాయి. మారణాయుధాలను ఆరాధిస్తూ మనిషి మనిషినీ విడదీస్తున్నాయి.'' జె. కృష్ణమూర్తి అన్న ఈ మాటలు ఈ రోజే, ఇప్పుడే, ఈ సందర్భానికే చెప్పినంత సూటిగా అనిపిస్తాయి.

మనిషిలో ఇప్పుడు కనిపిస్తున్నంత క్రూరత్వం, హింస మరెప్పుడూ వుండి వుండవు. ఇంత కాలంగానూ ప్రపంచంలో ఏదో ఒక మూల ప్రతి క్షణమూ కలహాలు జరగడం, రక్తపాతం స్రవించడం సంభవిస్తూనే వున్నాయి. ఇప్పుడు పరిస్థితులు విషమించి, దారుణమైన పరిణామాలకు దారితీశాయి. మొత్తం ప్రపంచంలో ఏ ఒక్క దేశమూ కూడా ఈ ఘోరాలకు దూరంగా, తటస్థంగా నిలబడి వుండే పరిస్థితి లేకుండా పోయింది.

''ఏ యుద్ధానికైనా వెనుక వుండే కారణం ఏమిటి - మత ధర్మానికి సంబంధించినదా, రాజకీయమైనదా, ఆర్థికమైనదా?'' అని ప్రశ్నించి, దేనినయినా మూఢంగా విశ్వసించడమే ఈ కారణం అంటూ ఎంతో హేతు పూర్వకంగా విపులీకరిస్తారు కృష్ణమూర్తి. జాతీయ వాదంలోనో, సిద్ధాంత వాదంలోనో, ఏదో ఒక మత ధర్మంలోనో విపరీతమైన నమ్మకం పెట్టుకొని, అదే అన్నింటికంటె ముఖ్యం, దాట రానిది అనే మూఢత్వమే మనిషిని వినాశనం వైపుగా నడిపిస్తున్నది. ఉదాహరణకి, మాది చాలా పవిత్రమైన మతం, మా దేవుడే అత్యున్నత దైవం అని అనడంలో వున్న మూర్ఖత్వానికీ, మా జాతి ఎంతో ప్రాచీనమైనది, మా దేశ చరిత్ర గర్వ కారణం, దేశాభిమానంలో మమ్మల్ని మించిన వారు లేరు అని అనడంలో వున్న అసంబద్ధతకీ పెద్దగా తేడా ఏమీ లేదు.

ఫలానా సిద్ధాంత వాదమే ప్రజలకి తిండీ, బట్టా, న్యాయం సమకూరుస్తుంది, ఇంకొక సిద్ధాంతాన్ని నమ్మేవారిని మేం బతక నివ్వం అనేది కూడా యుద్ధాలకి దారితీసింది. మా దేశంలో తయారు చేసిన వస్తువులకి మార్కెట్లు కావాలి; మా దేశంలో నిరుద్యోగం నిర్మూలించడానికి మారణాయుధాల ఫ్యాక్టరీలు పెట్టాం అవన్నీ వుపయోగించాలి, లేదా అమ్ముకోవాలి - ఇవి కూడా యుద్ధానికి ప్రబలమైన కారణాలు. ఈ కారణాలను నేపథ్యంలో దాచి, తమ వుపన్యాసాలతో ప్రజల్లో ఆవేశాలూ, వుద్రేకాలు రగిల్చి, శత్రు భూతాల్ని చూపి, భయ భీతుల్ని సృష్టించి, తమ వీరత్వాన్ని చాటుకొనే నాయకులున్నంత వరకూ యుద్ధాలు తప్పవు. అయితే, ''బాధ్యత కేవలం నాయకులదే కాదు'' అని కూడా కృష్ణమూర్తి అంటారు.

నిస్సందేహంగా యుద్ధాలకు కారణం అధికార కాంక్ష, కీర్తి తృష్ణ, జాతీయ వాదం అనే రుగ్మతా, జెండాని ఆరాధించడమూ, మత వ్యవస్థ అనే వ్యాధీ అయినప్పటికీ, ఇవి వున్నది నాయకులలో మాత్రమే కాదు, ప్రతి వ్యక్తిలోనూ వున్నాయి. నాయక స్థానంలో కూర్చున్నప్పుడు మీరూ ఇదే విధంగా ప్రవర్తిస్తారు అని శ్రోతలని హెచ్చరిస్తారు. అందుచేత, నాయకులని మార్చడం వల్ల, ప్రభుత్వాలను మార్చడం వల్ల పరిస్థితిలో ఏ మార్పు వుండదు. జరగవలసినది ప్రతి మనిషి మనసులోనూ సమూలమైన విప్లవం.

మానవ చేతన అంతా ఒకటే. ప్రతి మనిషి చేతనలోనూ వున్నది ఏమిటి? కేవలం మంచితనం, ప్రేమా, పరస్పర అభిమానాలూ వుంటే యుద్ధాలు జరగవు కదా? మనిషికీ మనిషికీ మధ్య ద్వేషం

---

సరోజిని ప్రేమ్ చంద్, ప్రముఖ రచయిత్రి, చెన్నై.

వుండదు కదా? కానీ, చేతనలో వున్నది గతం విడిచిన స్మృతులు - అంటే పాత అనుభవాలు. అవే మన ఆలోచనలను, మన ప్రతిచర్యలను, మన ప్రవర్తన సమస్తాన్నీ నడిపిస్తుంటాయి. ఆ స్మృతులే మనిషిని నిబద్ధుడిని చేస్తున్నాయి. పుట్టిన మరుక్షణం నుండీ చుట్టూ వున్న వాతావరణం, పెంపకం, విద్యాబుద్ధులూ మనిషి మనసును నిబద్ధిస్తున్నాయి. అంతే కాకుండా యుగయుగాల నుండీ, మనిషి ఈ భూమి మీద అడుగు పెట్టిన నాటి నుండీ పొందిన ఆ అనుభవాలన్నీ కూడా మెదడు కణాలతో పాటుగా పారంపర్యంగా వస్తున్నాయి.

అందుకే ''మీరు చదవవలసినది మీ జీవితం అనే పుస్తకం.'' అంతే తప్ప ఏ మత గ్రంథాలూ కాదు, పవిత్ర ప్రవచనాలూ కాదు. మహా వాక్యాలూ, వేదాంత తత్వాలూ కాదు. ''మొత్తం మానవాళి చరిత్ర అంతా మీ లోనే వున్నది.'' పాతుకొని పోయిన భయాలూ, ఆందోళనలూ, దుఃఖాలూ, సుఖ సంతోషాలూ, నమ్మకాలూ, ఆశలూ, దురాశలూ, అసూయా, హింసా, దౌర్జన్యం అన్నీ మానవ చేతనలో వున్నాయి. ఆధునిక జీవితంలోని ఒత్తిడులు పోటీతత్వాన్ని పోల్చి చూసుకోవడాన్ని, ఇంకా ఇంకా ఆర్జించాలనీ, ఏవో సాధించాలనీ, రకరకాలైన ఆకాంక్షల్నీ పదింతలుగా పెంచాయి. క్షణమైనా విరామం లేకుండా పనిచేస్తూ మనసు వుత్పత్తి చేస్తున్న ఆలోచనల ప్రవాహానికి అవే ఆధారం. ఆలోచనా ప్రక్రియని పరిశీలించడం, అవగాహన చేసుకోవడం ద్వారా స్వీయ జ్ఞానం కలుగుతుందని చెప్తూ, ఈ పరిశీలనలో 'పరిశీలకుడే పరిశీలన' అనే ఒక అసాధారణమైన మనోస్థితిని కృష్ణమూర్తి పరిచయం చేస్తారు. అంతేకాకుండా, వ్యక్తి తనను తాను తెలుసుకోవడానికి, అర్థవంతమైన జీవితం గడపడానికి బాహ్యంగా వున్న ఏ ఆధారాలూ అవసరం లేదనే సత్యం వినగానే ఆశ్చర్యకరంగానే అనిపిస్తుంది.

''ఈ పుస్తకం చదవడానికి బయటివారి అవసరం లేదు. మీకూ, పుస్తకానికీ మధ్య ఏ తత్వవేత్తా, ఏ మతాచార్యులూ, గురువూ, దేవుడూ ఎవ్వరూ వుండనవసరం లేదు. మీరే ఆ పుస్తకం. మీరే చదువుకుంటున్నారు.''

సాంప్రదాయికంగా వస్తున్న అభిప్రాయం ఏమిటంటే, మనిషి తనను తాను తెలుసుకోవాలంటే ఈ వ్యవహార ప్రపంచానికి దూరంగా వెళ్ళిపోయి శోధించాలని, కానీ పరస్పర సంబంధాలనే దర్పణంలో మాత్రమే వ్యక్తి తనకు తాను అర్థమవుతాడని సూచిస్తారు కృష్ణమూర్తి. సమాజానికి దూరంగా పారిపోవడంలో అర్థం లేదనీ, బాంధవ్యాలు లేకుండా జీవితం లేదనీ, అసలు అస్తిత్వం అంటేనే సంబంధం కలిగి వుండటం అనే ప్రతిపాదన చేస్తారు. ''జీవితాన్ని ప్రాపంచిక మనీ, పారమార్థికమనీ విభజించ కుండా వుండటం ముఖ్యం. ఈ స్థూల ప్రపంచం లేకుండా, అంటే పదార్థ ప్రపంచం లేనప్పుడు మనమూ వుండం. ఆకాశపు ఆ సౌందర్యం, కొండమీద ఒంటరిగా నిలబడివున్న ఆ చెట్టు, నడిచి వెళ్తున్న ఆ స్త్రీ, గుర్రపు స్వారీ చేస్తున్న ఆ పురుషుడు - ఇవన్నీ లేకుండా జీవితం వుండలేదు. మనం పరిగణించవలసినది ఈ మొత్తం జీవితం గురించి తప్ప, అందులోని ఒక ప్రత్యేక భాగం పారమార్థికమైనదనీ, తక్కినది అందుకు వ్యతిరేకమైనదీ అనే దృష్టితో కాదు. కాబట్టి పారమార్థిక లేక ఆధ్యాత్మిక దృక్పథం అంటే మొత్తం జీవితాన్ని గురించిన దృష్టి.''

ఏ మాత్రం ఆలోచించగలిగిన వారి నయినా బాధిస్తున్నది వర్తమాన సమాజంలో ఎక్కడ చూసినా కనబడుతున్న అవినీతి, కాలుష్యమూ. కుటుంబాల్లో కానీ, సమాజ వర్గాల్లో కానీ నిజమైన విలువలకు స్థానం లేకపోవడం. వీటిని గురించి ప్రశ్నించినప్పుడు కృష్ణమూర్తి సమాధానం వింతగా తోస్తుంది. దూరంగా వున్నదానిని అర్థం చేసుకోవాలంటే ముందుగా దగ్గరలో వున్నదానిని అర్థం చేసుకోవాలి అనేదే ఆయన సమాధానం. మన నిత్య జీవితంలో ఏం జరుగుతున్నది? మన పరస్పర సంబంధాలలో

స్వప్రయోజనానికి ఇతరులను వుపయోగించుకోవడమూ, మనలో కలుగుతున్న నిరాశలూ, నిస్పృహలూ, ఆ కారణంగా కలిగే అసహనమూ, ఆగ్రహమూ, ఇతరులపై పెత్తనం చేయాలనుకోవడమూ, గాయపరచడమూ, గాయపడటమూ, మెచ్చుకుంటే సంతోషపడటమూ, విమర్శిస్తే విరోధం చూపడం వంటి ఎన్నో మనోభావాలను అవి కలుగుతున్నప్పుడే పరిశీలించ కలిగితే వాటిని తొలగించుకోవచ్చును. దయ, ఉదారత, క్షమ, ఆత్మీయత మొదలైన గుణాలను ప్రత్యేకంగా అలవరచుకోనక్కరలేదు. మనసు ఖాళీగా ఉన్నప్పుడు, ఆలోచనలు మౌనం దాల్చినప్పుడు, స్వతః సిద్ధంగానే హృదయం ప్రేమతో నిండిపోతుంది. కాబట్టి సామాజిక సంస్కరణలు చేయడం వల్ల ప్రపంచం మారదు. వ్యక్తి అంతర్ముఖంగా దృష్టిసారించి తను ఏమిటో కనుగొన్నప్పుడే సమూలమైన మార్పు వస్తుంది. పునరుజ్జీవనం, పరివర్తన జరగవలసినది మనిషి అంతరంగంలోనని కృష్ణమూర్తి చెప్తున్నట్లుగా తోస్తుంది.

1895లో మదనపల్లిలో జన్మించిన జె. కృష్ణమూర్తి అరవై సంవత్సరాల పాటు ప్రపంచమంతటా పర్యటించి ప్రసంగించారు. ముఖ్యంగా అమెరికా, ఇంగ్లండు, కెనడా, స్పెయిన్, స్విట్జర్లాండులలో విశ్వవిద్యాలయాలలో చదువుతున్న యువతనూ, శాస్త్రవేత్తలనూ, మేధావులనూ, రచయితలనూ, కళాకారులనూ అమితంగా ఆయన ప్రభావితం చేశారు. పాఠశాలల్లో విద్యాబోధన పద్ధతుల్లో విప్లవాత్మకమైన మార్పులు రావడానికి కృష్ణమూర్తి చింతన ప్రధానంగా దోహదం చేసింది. 1986లో అమెరికాలోని ఒహాయిలో తుదిశ్వాస వదిలేవరకు నిర్విరామంగా పర్యటిస్తూ, ప్రసంగిస్తూ గడిపారు.

కృష్ణమూర్తి చేసిన ప్రసంగాలు, రచనలు పుస్తకాల రూపంలో, ఆడియో, విడియో క్యాసెట్ల రూపంలో భద్రపరచబడి వున్నాయి. వీటిని అందరికీ అందుబాటులోకి తేవడానికి కృష్ణమూర్తి ఫౌండేషన్ కృషి చేస్తున్నది.

ఆ మధ్య వార్తలలో, ఆహార గిడ్డంగులలో వేల కొద్దీ టన్నుల ధాన్యం కుళ్ళి పోతుంటే, మరొక ప్రక్కన ప్రజలు తిండి గింజలు దొరకక ఆకలి బాధతో అల్లాడి పోతున్నారని చదివాం. ఇది వెంటనే 1947లో మద్రాసులో ప్రసంగిస్తూ, ఒక శ్రోత అడిగిన ప్రశ్నకు కృష్ణమూర్తి ఇచ్చిన సమాధానాన్ని గుర్తు చేస్తుంది. ''మనిషికి కావలసిన నిత్యావసరాల పంపిణీకి సవ్యమైన సంవిధానం ఏర్పడాలి. మానవాళి అంతటికీ సరిపడిన ఆహారం వుత్పత్తి చేసే శాస్త్ర విజ్ఞానం ప్రస్తుతం మనకు వున్నది. కానీ, ప్రతి మనిషికీ తిండీ, బట్టా, గృహ వసతీ కల్పించాలంటే, చేపట్టవలసిన మార్గాలను, సాధనాలను కనిపెట్టడం కోసం ధనం వ్యయం చేయడానికి బదులు, మారణాయుధాల కోసమూ, అణుబాంబుల తయారీకీ, ముందు ముందు జరగనున్న యుద్ధాలకు సంసిద్ధ పరచుకోవడానికీ పెద్ద మొత్తాలలో ధనం వ్యయ పరుస్తున్నాయి దేశాలు.''

కృష్ణమూర్తి బోధనల్లో ఒక ముఖ్యమైన అంశం అసాధారణంగా కనబడుతుంది. సత్యాన్ని ఎవరంతట వారు స్వయంగా కనిపెట్టాలి తప్ప మరొకరు చెప్పినదానిని సందేహించకుండా, ప్రశ్నించకుండా ఒప్పుకోవద్దంటారు. చివరకు తనని కూడా గుడ్డిగా అనుసరించవద్దనీ, తను చెప్పిన వాటిని ప్రశ్నించి, పరీక్షించి, స్వయంగా ప్రయోగించి చూసుకోమనీ నిస్సంకోచంగా విజ్ఞప్తి చేస్తారు.

తనని ఒక తత్వవేత్తగా పిలవడానిని ఆయన అంగీకరించలేదు. అయితే 'ఫిలాసఫర్' అనే పదానికి వున్న అసలైన అర్థానికి సముచితగౌరవం ఇవ్వాలనేవారు. 'ఫిలాసఫీ' అంటే ''నిత్య జీవితంలో, ఇప్పుడు, సత్యం ఎడలా వివేకం ఎడలా ప్రేమ.'' కృష్ణమూర్తి ప్రసంగాలలోని సారాంశం దాదాపుగా ఇదే.

# హిందూయిజం-ఒక పరిశీలన

మూలం: తర్క తీర్థ లక్ష్మణ శాస్త్రి జోషి         తెలుగు: డా॥ ఎన్. ఇన్నయ్య

*'తర్క తీర్థ' కీ॥ శే॥ లక్ష్మణ శాస్త్రి జోషి ప్రస్తుతం మహారాష్ట్రలోని వాయ్‌లో నివసించేవారు. **1994** జులైలో న్యూయార్క్‌లో జరిగిన వేద సభలలో పాల్గొన్నారు. వీరు వాయ్‌లోని ప్రజ్ఞా పాఠశాలలో సంస్కృతం అధ్యయనం చేశారు. పండిత నారాయణ శాస్త్రి మరాఠే ఆయన గురువు. కాశీలో చదివి, కలకత్తా సంస్కృత కళాశాల నుండి ''తర్క తీర్థ'' స్వీకరించారు. సబర్మతి ఆశ్రమంలో గాంధీజీతో కొన్నాళ్ళు గడిపి, స్వాతంత్రోద్యమంలో, సహాయ నిరాకరణోద్యమంలో **(1930, 32)** పాల్గొని జైలు శిక్ష అనుభవించారు. ఎం.ఎన్. రాయ్‌తో పరిచయం అయిన తరువాత, పరస్పర ప్రభావంతో పునర్వికాసోద్యమానికి కృషి చేశారు. హిందూ ధర్మ కోష్ వెలువరించారు. మానవ వాదిగా రచనలు చేశారు.*

*''ఎ క్రిటిక్ ఆఫ్ హిందూయిజం'' **1940**లో మరాఠా భాషలో రాశారు. ఆ గ్రంథాన్ని జి.డి. పరేఖ్ ఆంగ్లంలోకి పరివర్తించగా, దానిని తెలుగువారికి ప్రముఖ పాత్రికేయులు, హేతువాది డా॥ ఇన్నయ్య పరిచయం చేస్తున్నారు.*

*ఈ తెలుగు అనువాదాన్ని డా॥ ఇన్నయ్యగారి చేత మిసిమి వ్యవస్థాపక సంపాదకులు డా॥ ఆలపాటి రవీంద్రనాథ్‌గారు చేయించారు, 'మిసిమి'లో ప్రచురణార్థం. కారణాంతరాల వల్ల ప్రచురణ ఆలస్యమైంది. ఈలోగా రవీంద్రనాథ్‌గారు కాలం చేయడం జరిగింది.*

*నేను, ప్రస్తుత మిసిమి సంపాదకుణ్ణి, ''రవీంద్ర స్మృతి'' ప్రచురణ సందర్భంగా ఆయన పాత ఉత్తరాలు 'నోట్సు', ఆయన రాయించిన వ్యాసాలు వెతుకుతుంటే ఇది బయలుపడింది.*

*ఈ వ్యాసంలో వేదాలు బ్రాహ్మణాలు, ఉపనిషత్తులు, బౌద్ధం, గీత నుంచి శంకరుడు వరకు అన్నీ ఒక నిశిత పరిశీలనకు గురయ్యాయి. ఈ పరిశీలనతో అందరూ ఏకీభవించవచ్చు, ఏకీభవించకపోవచ్చు. కాని ఈ వ్యాసం చదవదగింది. ఆలోచింప జేసేది.*

*- సంపాదకుడు.*

హిందూయిజం ఎన్నో దశలు అధిగమించి నేటి స్థితి దాల్చింది. కొన్ని దశలు కేవలం ఆటవిక మతాలనవచ్చు. వేదాల పూర్వం దైవజ్ఞ మతం, వేదాల కాలపు ఆర్యులు ప్రవచించిన శ్రుతి స్మృతుల మతం, విశ్వజనీయమైన శైవమతం, వైష్ణవ మతం, జైన మతం, బౌద్ధవాదం, హిందు సిద్ధాంతాలు, ఇవన్నీ హిందూయిజపు పరిణామాలే.

ఆటవిక మతాలన్నీ ఆదిమ దశలో మానవాళి చిహ్నాలు, వ్యవసాయం, ఇతర వృత్తుల ఆధారంగా సమాజంలో స్థిరత్వం రాకపూర్వం సంచార దళాలలో వున్న మతానికి ఇవి నిదర్శనాలు. సూర్య చంద్రులు, అగ్ని, త్రాచుపాము ఇత్యాదులన్నీ తొలిదశలో ఆటవిక దైవాలు. నాగాజాతిలో ఆచారంగా వస్తున్నదే 'నాగపంచమి' ఉత్సవం. హనుమంతుడు దైవంగా వానరులు పాటించినట్లు రామాయణం సూచిస్తున్నది. భిన్న ఆర్య జాతుల్లో భిన్న దేవుళ్ళున్నట్లు వేద పండితులంటున్నారు. ఈ జాతులు కొన్నిటికి ఒకే పేరుండటమూ కద్దు. సామాజిక కారణాలచే యీ జాతులు కలిసినప్పుడు ఒకరి ఆచారాలు, పూజా విధానాలు కలిసిపోతుండేవి. అందులో ఆటవిక గారడీ ఒకటి. ఇట్లా పండుగలు కలిసినప్పుడు అందరూ తమ సంపదాభివృద్ధికి, కలిసి ఉండటానికి ఉత్సవం జరుపుకునే వారు.

---

డా॥ ఎన్. ఇన్నయ్య, హైదరాబాదు, హేతువాది, రచయిత, ప్రముఖ పాత్రికేయులు.

ఇందులో కర్మకాండ, బృందనృత్యాలూ ప్రధానంగా ఉండేవి. ఆటవిక గారడీలో హోలీ పండుగ ప్రధాన భాగం. ఇవి గాక గ్రామ దేవతలు, ప్రాంతీయ దేవతలు ఉండేవారు. తొలుత వీరంతా ఆటవిక దైవాలే. బెంగాల్‌లో కాళి, మానస; ఉత్తరప్రదేశ్‌లో శితాలా; బీహార్‌లో గోరియా, దిల్లిగోరియా; తమిళనాడులో కార్తిక స్వామి; మహారాష్ట్రలో ఖందోలు వీరంతా ఆటవిక దేవుళ్ళ నుంచి వచ్చిన వారే.

చెట్లను, జంతువులను పూజించటం కూడా ఆటవిక మతాచారమే. అధర్వణ వేదంలో మూలికల్ని దేవుళ్ళుగా భావించారు. యజుర్వేదంలో యజ్ఞ సందర్భంగా కొన్ని చెట్లను పవిత్రంగా భావించి పూజించేవారు. వేదకాలపు ఆర్యుల ప్రాచీన జీవిత చిహ్నాలుగా వీటిని స్వీకరించవచ్చు. చెట్లలో ఉంబర, పింపర, మర్రి; జంతువుల్లో ఆవు, ఎద్దు బలికి ఉపయోగించేవారు. ఇట్లా జంతువులకూ, చెట్లకు పవిత్రత అంటగట్టటం ఇతర మతాల్లోనూ ఉన్నది. ప్రపంచ వ్యాప్తంగా ఆదిమ జాతులన్నీ నరబలి పాటించాయి. బ్రిటిష్ వారు చట్టబద్ధంగా భారతదేశంలో నరబలిని నిషేధించినా, నేటికీ అడపా దడపా నరబలి వినవస్తూనే ఉన్నది. వేదాల్లో నరబలి ఉన్నది. వేదకాలపు ఆర్యులలో నరబలి ఉన్నదనీ, ఉత్తరోత్తరా అది పోయిందనీ అర్థం చేసుకోవచ్చు. అభివృద్ధి జరగాలంటే నరబలి అవసరమని నమ్మినందున ఈ ఆచారం ప్రబలింది. హిందూయిజంలో ఇది క్షీణించింది.

వేదాలకు పూర్వం మన దేశంలో ఉన్న మతాలను పోలినవే ఈజిప్ట్, పర్షియాలలోనూ చూడొచ్చు. మధ్య ఆసియా, మధ్యధరా ప్రాంతాలలో ప్రాచీన భారత సంస్కృతి పోలికలున్నవి. హరప్పా, మహెంజొదారో శిథిలాలనుబట్టి భారతీయులతో యీ ప్రాంతాల వారికి పోలికలున్నవని డాక్టర్ గుహ, కీత్ పండితులు పేర్కొన్నారు. 5 వేల ఏండ్లకు పూర్వం సింధు నదీ తీరాన వేదాలకు ముందు మతాలున్నవి. ఇదే మధ్యధరా నాగరికత, వీరు ఆర్మినాయిడ్ జాతి. ఈజిప్ట్, క్రెట్, మెసపొటేమియా ప్రాచీన నాగరికతలలో శివుడు, విష్ణువు, కాళి, నాగపూజ, లింగపూజ, చంద్రుడు, గ్రహాలు వున్నవి. వేదాలలో లింగపూజ లేదు. అవి వేదేతరాలు. జ్యోతిష్యం, వారాలు, వ్రాత, వంశపారంపర్యంగా పౌరోహిత్యం, ఇవన్నీ మధ్యధరా నాగరిక లక్షణాలు. నైల్, టైగ్రిస్, యూఫ్రెటీస్, సింధు తీర నాగరికతల నుండి హిందూ మతం ఎన్నిటినో స్వీకరించింది. ఇదంతా వేదానికి ముందే ఉన్నది. ఆ ప్రాతిపదికలపై తరువాత శతాబ్దాలలో హిందూమతం విలసిల్లింది.

శ్రౌత - స్మార్తం ఆర్యమతం. వేదాల ముందు కాలం వారిని ఆర్యులు జయించారు. అయినా దేశమంతా ఆర్యుల ఆధిపత్యం స్థాపించలేక పోయారు. దేశ ఉత్తర, పశ్చిమోత్తర భాగాల్లో ఆధిపత్యం వహించిన ఆర్యులు, క్రమేణా రాజుల్ని జయించటం ద్వారా, పురోహితుల ప్రభావం చేత దేశమంతా వ్యాపించగలిగారు. ఆర్యులు తొలుత సంచార వేట జాతులవారు. పశువుల్ని మేపుకుంటూండేవారు. ఇతరులను జయించటం వారి కోరిక. యుద్ధంలో గుర్రాల్ని వినియోగించి తొలిదశలో ఆదిమ జాతుల్ని జయించారు. సంచార జాతులుగావటం వలన, యుద్ధలక్షణాలెన్నో వారికి ఉండేవి. కనుక స్థిరపడిన వ్యవసాయ వృత్తుల వారిని సులభంగా జయిస్తుండేవారు. ఆర్య మతంలో ఆవు, మేక, గుర్రం బలిపశువులుగా ఉండేవి. యజ్ఞాలలో పురోహితులు కూడా ఆవుల్ని, మేకల్ని, గుర్రాల్ని బలి ఇచ్చేవారు. ఇది పశువుల మేపరుల లక్షణం. యజ్ఞాలలో బంగారం, వెండి కూడా సమర్పిస్తుండేవారు. తరువాత దశల్లో భూమి ఇవ్వటం ఆనవాయితీ అయింది. ఋగ్వేదంలో దీని

ప్రస్తావన లేదు. ఆర్యుల దండయాత్రల అనంతరమే ఋగ్వేదంలో చాలా భాగం వ్రాశారు. అందులోనూ శక్తి పూజ జాస్తి. ఇదే యజ్ఞం భౌతిక సంపదలకై యజ్ఞం ఉద్దేశించబడింది. వీరి మతంలో గారడీ ఉండేది. అధర్వణ వేదంలో ఇది స్పష్టం. కామేష్టి యజ్ఞం గమనిస్తే తొలిదశలో యజ్ఞం కూడా ఒకవిధంగా గారడీ అని అర్థం చేసుకోవచ్చు. వేదకాలంలో సూర్యుణ్ణి అనేక నామాంతరాలతో పూజించేవారు. వరుణుడు, భూమి, విశ్వ కర్మ, అదితి, అశ్వని, ఇంద్రుడు, మరుత్, రుద్రుడు వేద దైవాలే. ఋగ్వేద మంత్రాల్లో ఈ దేవుళ్ళు విడివిడిగా సర్వజ్ఞులనీ, సర్వశక్తిమంతులనీ పేర్కొన్నారు. ఋగ్వేదం నాటికే ఈ దేవుళ్ళ శక్తులలో తారతమ్యాలు పోయాయి. అందరూ ప్రధాన దేవుళ్ళ స్థానానికి పోయారు. ఈ దేవుళ్ళ ప్రస్తావన వేరు వేరుగా చేసిన యజుర్వేదం నేటి రూపంలో ఋగ్వేద మంత్రాలు - సంహితాల అనంతరం వచ్చినా, కర్మకాండ వర్ణన ప్రస్తావించి నందున ఋగ్వేదానికి ముందు విషయమేననవచ్చును. అధర్వణ వేదంలోనూ దేవుళ్ళ ప్రసక్తి వచ్చినా, గారడీకే పరిమితమయ్యారు. ఈ గారడీ కూడా వేదకాలపు ఆర్యులదే. ఋగ్వేద ఋషులకు గారడీవచ్చు. వశిష్ఠుడు, భృగు, అంగీరస, అధర్వణులకు గారడీ తెలుసు. ఆనాటి ఆయుర్వేదం కూడా గారడీయే. సహజ వస్తువులకే దైవత్వాన్ని ఆపాదించారు. సూర్యుడు, అగ్ని లక్షణాలు అవగాహన కాక అలౌకిక శక్తులు ఆపాదించటం సహజం. మైత్రి పగలుగానూ, వరుణుడు రాత్రిగానూ ఊహించి దేవుళ్ళను చేశారు. మొక్కలు వచ్చే కాలపు సూర్యునిగా సావిత్రి చూడబడింది. పంటలు, మూలికలు పెంచి పోషించే దైవంగా పౌష్య పరిగణించబడింది. ఇంద్రుడు, భగ స్వభావం ఊహ్యామే గాని ఇదమిద్ధంగా చెప్పజాలం. ఇంద్రుడు శత్రువుల నెదుర్కొనే యుద్ధనిపుణుడు. సోమరసప్రియుడు. ఒక ఎద్దును అవలీలగా తినేయగలడు. ఉరుముల ఆకాశానికి అధిపతి. అతని స్నేహితుడు మరుత్. ఇంద్రుడు ఆర్యదేవుడు. వేటాడుతూ, పశువుల్ని కాపాడుతూ, సోమరసంలో మునిగితేలే ఇంద్రుడు ఆర్యులకు శక్తి సమకూర్చాడు. అప్పుడప్పుడు ఋషుల్ని, మునుల్ని కూడా ఇంద్రుడు వేటాడేవాడు. ఋగ్వేదంలో ఇంద్రుడు వ్రాసిన మంత్రాలున్నవి. ఋషి ఋక్కులు వ్రాస్తున్నప్పుడు అతన్ని ఇంద్రుడు ఆవరించి వ్రాయిస్తున్నట్లు ప్రజలు నమ్మారు. గాలివానల దేవుడు రుద్రుడు. అనంతాకాశానికి అదితి దైవం. ఇంచుమించు దేవతలందరికీ భౌతికాధికారం ఉన్నదనటంలో నేడు వివాదం లేదు. పదార్థ అవసరాలకే వారిని ప్రార్థించడం, పూజించడం జరిగింది. ఆవిధంగా మానవుల అవసరాలు తీర్చడంలో మతం ఆవిర్భవించింది. వీరిలో హెచ్చుమంది సూర్యునిపైనా, అగ్ని మీదా ఆధారపడేవారు. వేదాలలో దీనినే అగ్నిహోత్రం అన్నారు. ఆర్యుల దృష్టిలో వ్యవసాయం కంటె పశువుల పెంపకమే ప్రధానం. ''గోప్రధానమైన ధర్మపూర్ణ మేష్టి మరొక ఆర్య సంప్రదాయం.'' దీని ఫలితంగా ముక్తి లభిస్తుందనేది బ్రాహ్మణాల నాటికి రూఢి అయింది. వేదమంత్రాలలో, ప్రార్థనలలో పదార్థావసరాలే ఎప్పుడూ ప్రస్తావనకు వచ్చాయి. ధాన్యం, పశువులు, సంపద, కండ పుష్టి, స్త్రీలు, బానిసలు, ధైర్యశాలి ఐన పుత్రుడు, శత్రునాశనం, రోగం రాకూడదని ఇల్లాంటివే వేదాల నిండా ఉన్నాయి. వేదాలలో స్వర్గం అనేది ప్రస్తావన వున్నా విస్తృతంగా ఎక్కడా లేదు. వేద కర్మకాండలో అలౌకిక ప్రస్తావన ఉన్నా విస్తృతంగా ఎక్కడాలేదు. ఉపనిషత్తులలో ఇది చాలా హెచ్చుగా వచ్చింది.

(సశేషం)

"Published with Financial Assistance from the Central Institute of Indian Languages, (Ministry of Human Resource Development, Dept. of Secondary and Higher Education, Govt. of India) Manasagangotri, Mysore - 570 006 vide sanction Letter No. F. 53-1/2001-2002/LM/GRNT dated 19th March, 2002 under the scheme of Grant-in-Aid L.M."



"శకుంతల నిర్గమనం"

చిత్రకారుడు: కె. వెంకటప్ప